# భాగవతకథలు

గ్రంథకర్త
చివుకుల సుబ్రహ్మణ్యశాస్త్రి
తెనుఁగు పండితులు, బోర్డు హైస్కూలు, కావలి.




ప్రచురణకర్తలు :
వేంకట్రామ అండ్ కో.,
మద్రాసు – విజయవాడ

1951

 [మూల్యము ౨ అణాలు

# విషయసూచిక

# పీఠిక



ప్రపంచమునందు జీవుఁడు మానవజాతియందే భూతదయ, సత్యసంధత మున్నగు సత్ప్రవర్తనపు గుణములు గలవాఁడై మంచిస్థితికి రావలయును. ఇతర మార్గములున్నను గారణాంతరములచేఁ గొంచెముగఁ గలవని చెప్పనగును. సహజముగ సద్గుణములు కలవాఁడై మనుజుఁడు పూర్ణానందము గలవాఁడగుటకు భగవదనుగ్రహము కలవాఁడు కావలయును. ఆ దైవానుగ్రహమును ఆతని సద్వర్తన, సద్గుణ సదాచారముల చేతనే పొందవలయును. ఆ సద్వర్తనాదులును బాల్యము నుండియె మానవసంఘమునందు వ్యాపించినంగాని పొందనేరవు. కనుక చిన్నతనమునుండియె బాలుర కట్టి గుణము లలవడునట్లు సేయవలయునన్నచో నట్టియలవాటు కలవారల చరితములు సుప్రసిద్ధములయినవి వినిపించుటకంటె సులభమగు మార్గాంతరము లేదు. ఆ కారణమున నట్టివారల చరిత్రములు పఠనీయములు కావలయునుగదా ? కాన మన పూర్వపు ఋషులు పూర్వకాలపు మహనీయులగువారల చరితములను బురాణములయందు బ్రకటించియున్నారు. అట్టి పురాణములను దేశభాషలయందు వెల్లడిచేసి దేశభాషా కవిపుంగవులు వన్నెకెక్కియున్నారు. అట్టి గ్రంథములయందలి వివిధ విషయములను ఇప్పటి మనసంఘ పురోభివృద్ధికి నాధారభూతులగు విద్యార్థులగు బాలకుల మనస్సులయం దంకురింపజేయవలయు నన్నచో సులభశైలిలో నాయావిషయములను దేశభాషలో వచనము నందు వ్రాయుటకంటె వేఱుపాయము లేదు. కనుక భాగవత

పురాణమునందలి కొన్ని కథలు, వర్తమానాంగ్లాంధ్ర పాఠశాలలయందలి బాలురకు సులభముగ దెలియుటకై యాంధ్రభాషయందు వ్రాయఁబడెను.

ఇట్టి గ్రంథములు పఠించుటవలన భగవద్భక్తి, మాతాపితృభక్తి, సత్ప్రవర్తన, సత్యసంధత, ఔదార్యము, దయ, సత్యము మున్నగు గుణములు పాఠకులగు బాలురు మున్నగు వారల మనస్సులం దంకురింపఁజేసి, పెంపును బొందింపఁ జేయఁ గలవనుట యతిశయోక్తి కానేరదు. ఆయా స్థలములయందు సందర్భానుసారముగఁ గొన్ని తెలుఁగు గ్రంథములందలి పద్యములను జేర్పఁబడెను.

ఇట్లు విన్నవించు సుజన విధేయుఁడు,
చివుకుల సుబ్రహ్మణ్య శాస్త్రి.

# భాగవతకథలు



## ౧. అజామీళుఁడు

క. "హరిభక్తులతో మాటలు
ధరనెన్నఁడుఁ జెడని పుణ్య ♦ ధనములమూటల్
వరముక్తి కాంత తేటలు
నరిషడ్వర్గంబు చొరని ♦ యరుదగు కోటల్."

కన్యాకుబ్జనగరమున అజామీళుఁ డను భూసురుం డొకఁడు గలఁడు. అతఁడు చతుర్వేదములను, సకల ధర్మ శాస్త్రములను సంపూర్తిగ నభ్యసించి నిరంతరము నాచార పరుఁడై యొప్పుచుండెను. ఆతఁడు సమస్తశాస్త్రముల నభ్య సించి విజ్ఞానసంపన్నుఁడై యుండినను, మోహమును మాత్రము గెలువలేక పోయెను.

ఆతడొకనాఁడు భగవద్దర్శనముకై పురసమీపముననున్న వనంబునకుఁ బోయెను. ఆ సమయమున నచ్చటి కొక వృషలి వచ్చెను. అక్కాంత కడు సౌందర్యవతి. దానింగాంచిన యంతనే యజామీళుని చిత్తము చలించెను. ఆతఁ డా నారీమణికి వశ్యుఁ డయ్యెను. ఆతఁ డా వృషలిని నిజపత్నిగా భావించి సమస్త సౌఖ్య భోగముల నందుచుండెను. ఆచారము మొద లగునవి క్రమక్రమముగా నశించెను. చౌర్య ద్యూతపానము లాతనిని వరించెను. ధనార్జనమునకై యనేక క్రూరకృత్యములను జేయుచుండెను. అగ్నిసాక్షిగఁగై కొన్న భార్యముఖమే చూడక

యుండెను. వృషలియం దాతనికిఁ బెక్కండ్రు కుమారులు పుట్టిరి. కనిష్ఠకుమారుని పేరు నారాయణుఁడు. నారాయణునియం దజామిళునకుఁ బ్రేమ మెక్కువ యుండెను. ఎప్పుడును నాతఁ డక్కుమారు నెడబాయక యుండెను.

కొన్నాళ్ళ కా యజామిళుఁడు వృద్ధుఁడయ్యెను. దృష్టి మాంద్యము కలిగెను. శరీరమంతయు ముడుతలుపడెను. చేత గఱ్ఱ లేకున్న నడువలేకయుండెను. తలయంతయు నెరసెను. వీనికి దోడు జాడ్యముగూడ సంభవించెను. తుదకు మరణకాలము గూడ సంభవించెను. ఘోరభయంకరరూపములతో యమ కింకరులాతని కన్నులయెదుటనిలిచిరి. ఆసమయమున బాలుఁడగు నారాయణుఁడు తోడిబాలురతో నాఁడుకొనుచుండెను. అట్టి సమయమునం దయినను నజామిళుఁడు కుమారుని మఱువక యాతనిపై బ్రేమను విడువలేక "నారాయణా! నారాయణా!" యని పెక్కుమారులు పిలిచెను. అజామిళుని నోటినుండి నారా యణ శబ్దము వచ్చిన యంతనే విష్ణుదూత లరుదెంచి, యమ దూతల నావలకు బాఱఁదోలిరి.

అజామిళునకు యమకింకరులను జూచినప్పుడు కలిగిన భయము, విష్ణుదూతలను జూచినంతనే పోయెను. ఆతఁడు మంచముపై నుండి లేచి వారికి నమస్కరించి యేదియో పలుక బోయెను. కాని వా రదృశ్యులైరి. విష్ణుదూతలను దర్శించుట చేత నాతనికిఁ గొంత జ్ఞానము కలిగి, యదియంతయు నారా యణుని దివ్యమహిమ యని తలంచి, తా నంతకుపూర్వ మొన ర్చిన దుష్కార్యములకు మిగులపశ్చాత్తాపమునంది, విరాగియై, పుత్రసహితయగు వృషలిని విడిచి, గంగాతీరమునకుఁ బోయి,

యిందిరారమణుని మనంబున నిలిపి ఘోరమైన తపస్సుఁజేసి ముక్తిఁబొందెను.

అనేక పాపకార్యము లొనర్చినను మరణసమయమున శ్రీమన్నారాయణనామ సంస్మరణచేత నజామిళుఁడు స్వర్గమును బొందగలిగెను. కావునఁ బ్రతిమానవునకు నారాయణ దివ్యనామస్మరణము సర్వశుభముల నిచ్చు ననుమాట వ్యర్థము కాదు. సంసారబంధమునుండి తప్పించి, నిరంత రామోదము నొసంగునది యొక హరిపాద చింతనమే.

---

# ౨. బలిచక్రవర్తి

గీ. "బ్రతుకవచ్చుఁగాక ♦ బహుబంధనములైన
వచ్చుఁగాక లేమి ♦ వచ్చుఁగాక
జీవధనములైన ♦ జెడుఁగాక పడుఁగాక
మాటఁ దిరుగలేరు ♦ మానధనులు."

దేవదానవు లమృతంబునకై పోరాడినప్పుడు దైత్యవల్లభుండైన బలి దేవేంద్రునిచే నోడింపబడి, తన యనుచరులతో నందందు జరియించుచు సమయమునకై వేచియుండి దైత్యాచార్యుండగు శుక్రునకు శిష్యుండై యతనిచిత్తంబు రంజిల్ల సేవించుచుండెను. బలిభక్తికి శుక్రుఁడెంతయు సంతసించి యతనిచేత విశ్వజిద్యాగంబుఁ జేయించెను. దానిచేహోమ పావకుఁ డాబలికి కాంచనపటబద్ధ రథంబును, సూర్యుని హయంబులఁ బోలు హయంబులును, గంభీరవధ్వజమును, దివ్యమైన

ధనువును, గవచంబు నిచ్చెను. అతనితాతయగు ప్రహ్లాదుఁడొక పద్మమాల నొసంగెను. శుక్రుఁడొక శంఖమును బ్రసాదించెను. ఇట్లు మహాదనుగ్రహము వడసిన యాతఁడు దేవేంద్రునివహసించు వైభవము గలిగి, పలుదానంబుల విప్రులం దనిపి, త్రిభువన విఖ్యాత పరాక్రమముచే నొప్పి, దేవతలను సాధింపఁ దలఁచి మహాశౌర్యధనులగు పెక్కండ్రు దానవవీరు లాతనిం బలిసి కొలువ, నమరావతిపై దండెత్తెను. ఇట్లు పరాక్రమంబున విజృంభించి యబ్బలి తననగరముపై దండువిడియుటఁ జూచి మహేంద్రుఁడు బృహస్పతిని రావించి "గురువర్యా! ఇంతకుఁ బూర్వ మీతఁడు మనచే నోడింపఁబడి మరల దండెత్తి వచ్చి నాడు. ఇంతలో నీతని కిట్టి ధైర్య సాహసము లెట్లు వచ్చినవి? ఈతని కెవ్వఁడు తోడయ్యె? కాలాంతకుని చందమున వెలిం గెడు నీతని నెట్లు రణంబున మార్కొనఁగల" మని పలికెను.

అందులకు బృహస్పతి సురేంద్రునింజూచి యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. "మహేంద్రా! యాగమొనర్చి బ్రహ్మవాదు లయిన శుక్రాచార్యాదుల యనుగ్రహమున నీతఁడిట్టి సంపదల నందినాడు. ఈ సమయమున వీని నెవ్వరును గెలువఁజాలరు. రణం బున శత్రువుల గెలువవలయును, లేదా సామాన్యముగఁ బోర వలయును. ఈ రెండునుగాకున్న వీరస్వర్గము నయినను బొంద వలయును. ఇవి సమకూడనప్పుడు తొలఁగిచని సుదినములకై నిరీక్షించుచుండుట మంచిది. కావున నీ విప్పుడు రాజ్యము విడిచి కొన్నాళ్ళందందుఁ గాలము గడుపుట మంచిది" యని పలికెను. మహేంద్రుఁడు బృహస్పతివాక్యములకు సమ్మతించెను. అమరు లెల్లరును గామరూపులై యమరావతిని విడిచి చనిరి. అంతట బలి శత్రువివర్జిత మగు నాకము నాక్రమించి మూడు

లోకములును దనవశముఁ జేసికొని పరిపాలించు చుండెను. భృగ్వాదు లాతనిచే శతాశ్వమేధంబులం జేయించిరి. దైత్య చక్రవర్తియగు నా బలి ధర్మసంబద్ధుఁడై విప్రులం దనుపుచు వదాన్యుండని ప్రసిద్ధిగాంచుచు రాజ్యపరిపాలనము సేయు చుండెను. ఆతని పరిపాలన భూతలంబున నెవ్వరికి నేవిధమైన కొఱంతయు లేక యుండెను.

ఇట్లుండ నమరమాతయగు నదితి పుత్రుండగు మహేంద్రుండు సతీసుతులతోడను, నమరులతోడను రాజ్యమువిడిచి యందందుఁ బలుబాములు పడుచుండుట కాత్మవగచి నాథుండయిన కశ్యపుని జేరి, మ్రొక్కి దీనాననయై ఇట్లు పలికెను. "దేవా! బలిచక్రవర్తి నాకము నాక్రమించి, త్రిభువన ప్రఖ్యాతి వహించుచుఁ బరిపాలనము చేయుచున్నాఁడు. యెండ కన్నెఱుఁగని యింద్రుని యిల్లాలు పరులపంచలఁ బడియుండెను. త్రిభువన సామ్రాజ్యముఁ గోలుపోయి దేవేంద్రుఁ డడవులయందు దిరుగు చుండెను. తత్సంతానమగు జయంతాదులు నానావస్థలఁ బడు చుండిరి. కావున నమరులకు సౌఖ్యము గల్గువిధంబు నీ వారయుము" అనుపలుకులు విని కశ్యపుఁడు "నారీమణీ! ఇది యంతయు విష్ణుమాయ. కావున నీ వాతని సేవింపుము. శుభము గలుగు" నని తెలిపి నారాయణ పూజావిధానము నెఱింగించెను. కశ్యపాదేశంబున నా సాధ్వీమణి శ్రీహరిని సేవింప నతఁడు ప్రత్యక్షం బయ్యెను. అదితి యామహాత్మునకు నమస్కరించి యనేకవిధములఁ బ్రస్తుతించి "దేవా! అసురులు సురల నదలించి నాక మేలుచున్నారు. కన్నకడుపుగావున నిట్లు చింతించు చున్నాను. నాచింతఁ బాపి నన్నురక్షింపు" మని విన్నవించెను. అప్పలుకులు విని యాశ్రిత కామధేనువైన హరి యామె

కిట్లనెను. "నీవు చింతింపవలదు. ఆ దైత్యులను మాయోపాయ
మున జయింపవలయును. నీవు నీనాథుని సేవింపుము. నేను నీకు
దనయుఁడనై బలిగర్వము నడంచి తద్భాగ్యముహరించి బృందా
రకులచే దివం బేలింతు''నని పలికి యంతర్థానుఁడయ్యెను. అదితి
కశ్యపుని యాశ్రమమున నుండి యాతనిం గొలుచుచు గర్భము
ధరించి, కాలక్రమమున నొక శుభదినమున వామనునిగనెను.
ఆ బాలుఁడే శ్రీమన్నారాయణుఁడు. ఆతనిజననమునకు సుపర్వు
లెల్లరును సంతోషించిరి. ఇట్లు జనించిన భగవంతుఁడు తన నిజ
రూప ముజ్జగించి, కపటవటుని చందమున నుండెను. ఆ బాలు
నకు కశ్యపప్రజాపతి మహర్షులచే నుపనయన కర్మకలాపములు
చేయించెను. ఆతనికి సవిత సావిత్రి నుపదేశించెను. బృహస్పతి
యజ్ఞోపవీతంబును, సోముఁడు దండమును, గగనాధిష్ఠానదేవత
ఛత్రంబును, బ్రహ్మ కమండలువును, సరస్వతి అక్షమాలికయు,
సప్తర్షులు కుశపవిత్రంబులు నిచ్చిరి. యక్షేశుఁడు భిక్షాపాత్ర
నిచ్చెను. అక్షయంబని పార్వతి భిక్షఁబెట్టెను.

ఇట్లు కృతకృత్యుండైన వామనుఁడు దేశాంతర సమా
గతులయిన భూసురులవలన బలివదాన్యతగూర్చి విని, తల్లి
దండ్రుల యనుమతిని వడసి, యాతనిం జూడదలఁచి బయలుదేఱి
నర్మదానదిం దరించి యుత్తరతటంబున నున్న దానవేంద్రుని
యశ్వమేధవాటిక సమీపించెను. ఆతనిఁజూచి యచ్చటివా
రెల్లరు నాశ్చర్యమందుచు ననేకవిధములఁ దమలోఁ దాము
మాటలాడు కొనసాగిరి. సామగానంబులఁ జేయు నుద్గాతల
చేతను, మంత్రతంత్రార్థములం బేర్కొను మహనీయులచేతను,
హోమకుండంబులందున్న త్రేతాగ్నుల వెలిగించు యాజకుల
చేతను, యాగవాటము నిండియుండెను. వామనుండు యాగవా

టమును బ్రవేశించి, సభామధ్యముననున్న బలిచక్రవర్తిం జేరి కుశపవిత్రాక్షర సంయుతంబగు దక్షిణహస్తముసాచి యాశీర్వ దించెను. బలి తన యాసనంబునుండి లేచి వటుని పాదములకు నమస్కరించి, బహువిధములఁ బూజించి గద్దియపై గూర్చుండ బెట్టి భక్తివినయంబెల్లఁ బ్రకటించుచు నిట్లు పలికెను. "వడుగా నీ వెవ్వరివాఁడవు ? నీ నివాసస్థలం బెయ్యది ? నీ విచ్చేయ కరు దెంచుటం జేసి నేను ధన్యుఁడ నయితిని. నావంశము పావన మయినది. నా యజ్ఞము యోగ్యమయ్యెను.

మ. వరచేలంబులొ మాడలో ఫలములో ♦ వన్యంబులో
గోవులో । హరులో రత్నములో రథంబులొ విశి ♦ ష్టాన్నం
బులో కన్యలో । కరులో కాంచనమో నికేతనములో ♦
గ్రామంబులో భూములో । ధరణీఖండమొ కాక యేమడిగె
దో ♦ ధాత్రీసురేంద్రోత్తమా !"

అని బలి పలుక వామనుఁడు మిగుల సంతోషించి యిట్లనియెను. "దానవేశ్వరా! ఇది నా నివాసమని యెట్లు చెప్పుదును ? లోకమునం దంతటను చరించుచుందును. నే నెవ్వరివాఁడ నని నుడువుదును? నే నందఱకును గావలసినవాఁడనే. ఎప్పుడును సుజనులయం దుందును. విషయ మట్లుండనిమ్ము. నీవు సత్యసంధుఁడవు. మీ కులమువారందఱును మంచివారు. మీ కులమున రణభీరువులును వితరణభీరువులును లేరు. మీ తాతయగు ప్రహ్లాదుని యశోలతలు భూతలంబునుండి త్రివిష్ట పమునకుఁ బ్రాకినవి. నీ వాతని గుణంబులను బూని జన్మించి తివి. ఇంద్రాదులఁ దోలి త్రిజగంబులను బరిపాలించుచుంటివి. రాజ్య మున్నంతమాత్రమున పేరురాదు. అర్థిజనరక్షణము

కలిగియుండవలెను. నే ననేక వదాన్యులను వినియుంటినిగాని నిన్నుబోలినవాఁడీజగముల లేఁడు. నీకేమి కావలయునని నన్ను గోరితివి. ఒంటివాఁడనగు నాకేమి కావలయును? మూడడుగుల నేల యిమ్ము; అదియే నాకు బ్రహ్మాండమగును."

ఆ పలుకులకు దానవేంద్రుఁడు నవ్వి "భూసురోత్తమా! యాచనావిధానము నీకు దెలియనట్లున్నది. ఇట్టి స్వల్ప దానము నిచ్చుట నాకే లజ్జగ నుండును. అసురేంద్రుఁడొక బ్రాహ్మణునకుఁ బదత్రయమేర దానం బిచ్చె నన విన్నవారు నవ్వుదురు. కావున నధికం బయినది యింక నెద్దియైన గోరుము" అనెను. ఆ మాటలకు మాయామాణవకుం డగు శ్రీహరి యిట్లనెను. "తనకు బ్రాప్తమగునట్టిది లేశమయినను బదివేలని భావించి తృప్తిఁజెందని మనుజుఁడు సప్తద్వీప సామ్రాజ్యము లభించినను దృప్తిఁబొందఁడు. ఆశకంతములేదు. సంతుష్టుఁడు మూఁడు జగంబులయందును బూజింపఁ బడును. సంతోషి కెప్పుడును సుఖముండును. వానికి ముక్తి లభించును. నీవు రాజేంద్రుఁడ వని నిఖిలము నడుగుట నాకు ధర్మము గాదు. నాశక్తికిఁ దగినది నేను నిన్ను యాచించితిని. నేను కోరిన పాదత్రయ భూమినిమాత్ర మిమ్ము. నేనితరముగోరను. స్వీకరింపను." బలి యిఁక మారుమాటాడలేదు. వామనుఁడు కోరినదాన మీయ నిశ్చయించెను. శుక్రుఁడు దానవేంద్రుని నిశ్చయం బెఱింగి రహస్యముగా నాతనితో నిట్లనెను. "దనుజేశ్వరా! ఈతఁడు నిజమైన ధరణీసురుఁడు కాఁడు. దేవ కార్యము సాధించుటకు శ్రీహరియే యదితి గర్భమున నిట్టి రూపమున జనించినాఁడు. ఈ పరమరహస్యము నీ వెఱుంగక కోరినదానం బిచ్చెదనని పలుకుచుంటివి. దీనివలన దైత్యసంతతి

కుపద్రవము కలుగును. ఈతఁడు నీ వైభవమెల్ల హరించి యింద్రునకుఁ గూర్చును. మూడడుగులను మాటయేగాని విశ్వరూపుఁడై మూఁడులోకములు నాక్రమించును. ఏదానము వలన నాశ మొదవునో యయ్యది దానముగాఁ దలంపరాదు.

ఆ. వె. వారిజాక్షులందు ♦ వైవాహికములందుఁ
ప్రాణ విత్తమాన ♦ భంగమందుఁ
జకిత గోకులాగ్ర ♦ జన్మరక్షణమందుఁ
బొంకవచ్చు నఘము ♦ వొందఁ డధిప!

కావున నామాట విని యీ దానమును మానుము. రాజ్యమును, వంశమును నిలుపుము.''

ఆమాటలువిని బలిచక్రవర్తి క్షణమాత్రము నిమీలితలోచనుండై యోచించి శుక్రున కిట్లనెను. "మహాత్మా! నీవు నిజముఁజెప్పితివి. ఇయ్యది గృహస్థధర్మమే. కాని యిందులకు నాచిత్తము సమ్మతింపదు. పలికి లేదనుటకంటె మఱియొక పాపములేదు. ఎట్టి దుష్కర్మనినైన భరించెదను గాని సత్యహీనునిమాత్రము మోయజాలనని మున్ను భూదేవి బ్రహ్మతో వచించి యుండెను. ఆచార్యా! యెందఱు మహారాజులు ధరిత్రిఁ బాలించిరి? ఎందరేగిరి? ఒక్కఁడైన సిరిని మూటఁ గట్టుకొని పోవంజాలెనా? యశఃకాములయిన శిబిప్రముఖుల పవిత్రనామంబులు జగంబున నెప్పటికైన మఱపునకువచ్చునా? స్వామీ! క్రతువులచేతఁగాని, తపములచేతఁగాని పొందశక్యముగాని యీ మహానుభావుఁడు నా పూర్వపుణ్యమున నియ్యెడ కర్థియై వచ్చినాఁడు.

శా. "ఆదిన్ శ్రీపతికొప్పుపైఁ దనువుపై ♦ నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపై ♦ బాలిండ్లపై నూత్నమ
ర్యాదం జెందుకరంబు గ్రిందగుట మీఁ ♦ దై నాకరంబుంట
మేల్గాదే రాజ్యముగీజ్యమున్ సతతమే♦ గాయంబనాపాయమే."

మ. "నిరయంబైన నిబద్ధమైన ధరణీ ♦ నిర్మూలనంబైన దు
ర్మరణంబైనఁ గులాంతమైన నిజమున్ ♦ రానిమ్ము కా
నిమ్ము పో । హరియైనన్ హరుఁడైన నీరజభవుం ♦ డ
భ్యాగతుండైననౌఁ । దిరుగన్నేరదు నాదుజిహ్వ వినుమా ♦
ధీవర్య ! వేయేటికిన్."

ఈ మహానుభావుఁ డడిగిన దానమేకదా నే నిచ్చు చుంటిని. అట్టియెడల నన్నితఁ డేల వంచించును ? ఒక వేళ వంచించుఁగాక ఆతఁడే రక్షించును. రక్షింపడా ? పోనిమ్ము. నేనుమాత్ర మన్నమాటఁ దప్పను. మేరువు తల్లక్రిందగుఁగాక ! పారావారము లింకుఁగాక ! యెవ్వరిని వేఁడనివాఁడఁట. ఒంటివాఁడఁట. సమస్తము నెఱింగినవాఁడఁట. అట్టివాఁ డర్థియై నాకడ కరుదేరఁ బొమ్మని యెట్లు ద్రోసిబుచ్చుదును ? ఇంత కంటె మఱియొక పాప మున్నదా ?"

శుక్రునిమాటలకు బలి సమ్మతింపలేదు. అందులకు శుక్రుం డలిగి పదభ్రష్టుఁడ వగుమని యాతనికి శాపమిచ్చెను. బలిచక్రవర్తి శాపమున కయినను భయమందక వటునకుఁ బాదత్రయ భూమి నొసంగ సంకల్పించుకొని, నిజసతీమణి యగు వింధ్యావళిని హేమఘటముతో జలంబులఁ దెమ్మనెను. ఆమె బంగారుకలశంబుతో జలంబులఁ దెచ్చి భర్తకొసంగెను.

అంతట దానవేంద్రుఁడు పాపసంహారణములగు శ్రీహరి చరణంబులఁ గడిగి తజ్జలంబును దనశిరముపై జల్లుకొని ధారాపూర్వకముగాఁ బదత్రయ భూమిని దానంబిచ్చెను. మాయా మాణవకుండనియు, నట్టి దానమువలన నాశనము గలుగు ననియు, శుక్రుం డెంత చెప్పినను వినని బలింబోలు వదాన్యుఁ డెందైనఁ గలఁడా? వామనుఁ డా దానమును గ్రహించి విశ్వరూపము ధరించి భువియును నభమును నాక్రమించెను.

"సత్యసంధుఁడు గావున బలిచక్రవర్తి విష్ణుం డని యెఱుంగక యిట్టి దానమును జేసినాఁడు. ఈ వామనుఁడు పదత్రయవ్యాజంబున సకలమహీమండలము నాక్రమించె" నని పలుకుచు ఖడ్గాద్యాయుధంబులఁ గొని దానవులు కొందఱు హరిపైకి నడవఁజూచిరి. అప్పుడు బలి వారిని విలోకించి "రాక్షసోత్తములారా! మనకు గలహంబున కిది కాలముగాదు. భగవంతుఁడగు శ్రీహరియే యిట్లు చేసినప్పు డెవ్వ రేమి సేయగలరు? మీ యుద్యమమును మానుఁ" డని పలికి వారించెను. అంతట శ్రీహరిభావం బెఱిఁగి గరుడుఁడువచ్చి వరుణపాశమున బలిని బంధించెను. అట్లు బంధింపబడిన బలి, యది హరికరుణా విశేషమేయని భావించి ధైర్యమున నిలిచెను. సమస్తసంపదలు చెడినను, దైన్యముగాని కంపముగాని లేక ధైర్యమును విడువక నిలిచిన బలింజూచి వామనుఁడు "దానవేంద్రా! త్రిపదభూతలం బిత్తునని పలికితివి. సూర్యచంద్రు లెందాకనుందురో యంత భూమియు నొక్కయడుగయ్యెను. స్వర్లోకమొకయడుగయ్యెను. తక్కినపాదమునకు స్థలమెచ్చటనున్నది? ఇచ్చెదనని చెప్పినదాన మీయకయున్న గడుఁబాపము సంభవించును. దానివలన

నిరయము సంభవించును. కావున నీ విచ్చెదనన్న మూఁడవ పాదమునకుఁజోటుఁజూపుము'' అనిపలికిన, నబ్బలి ''మహానుభావ! నేనసత్యమాడను. నీ తృతీయపాదము నా శిరమునఁబెట్టుము. స్వామీ! నీవు నన్నిట్లు చేసితివని నేను విచారింపను. నీకు నాయందుఁ గరుణయుండుటచేతనే యిట్లొనర్చితివని సంతసించెదను. నీతో వైరము గల్పించుకొనిన మావారు నీయనుగ్రహమున నాదియోగీంద్రులందు దివ్యపదంబుల నందిరి. పద్మాక్షా! ముకుందా! మాధవా! అర్థివై నీవు నాకడకు అరుదెంచుట నాపూర్వపుణ్యముకాదే!'' యని పలికెను. అప్పు డచ్చోటికిఁ బ్రహ్లాదుఁడు వచ్చి హరికి నమస్కరించి ''దేవా! ఈతనికి మున్నింద్రపదం బిచ్చి యిప్పుడు త్రిప్పితివి. ఇది యంతయు నీ మాయ. నీ పాదసేవఁ జేయువారికి సురరాజ్యపద మేల? ఈతనిని నీవు రక్షించుటకే యిట్లు చేసితివి'' అని పలికెను. శ్రీహరి ప్రహ్లాదునిం జూచి యిట్లు పలికెను. ''నే నెవ్వని గరుణింపఁ దలంతునో వానివిత్తమెల్ల హరింతును. సమస్తైశ్వర్యమును గోలుపోయి, బద్ధుఁడయిన నీతఁ డొక్కింతయు జలింపక యున్నవాఁడు. ఈ బలి సావర్ణి మనువువేళ దేవేంద్రుఁ డగు'' నని పలికి, బలింజూచి యిట్లనెను. ''దానవేంద్రా! నీవు సమస్తసంపదల నంది సుతలంబున నుండుము. నేను నిన్నచ్చట నిరంతరము రక్షించుచుందును.'' శ్రీహరి యాజ్ఞ ననుసరించి బలి తనవారితో సుతలంబునకుఁ జేరెను.

---

# ౩. అంబరీషుఁడు

ఆ. వె. "తనువు మనువు విడిచి ♦ తనయులఁ జుట్టాల
నాలి విడిచి సంప ♦ దాళి విడిచి
నన్నుఁ గాని యన్య ♦ మెన్నఁడు నెఱుఁగని
వారి విడువ నెట్టి ♦ వారినైన."

పూర్వము అంబరీషుఁడను నొక రాజేంద్రుఁ డుండెను. అతఁడు సప్తద్వీప విశాల భూమీతలంబును నిరంకుశముగఁ బరిపాలించుచు, విష్ణుభక్తిపరాయణుఁడై సద్గుణసముద్రుండన మిగుల విఖ్యాతి వహించెను. కల్మషదూరుఁడైన యాతఁడు వసిష్ఠ మహాముని ప్రముఖుల గురుత్వంబున సరస్వతీ తటంబున హరి ప్రీతిగ ననేక యాగంబులు గావించి భూసురులను గణుతింప నలవిగాని దక్షిణలచే దనిపెను. పురుషోత్తముఁ డాతని భక్తికి మెచ్చి ప్రతిభట శిక్షణంబును, నిజజన రక్షణంబును నగు చక్రమాతనికిఁ బ్రసాదించెను. ఇట్లు శ్రీహరియనుగ్రహము వడసిన యాభూపాలుఁడు భార్యతోఁ గూడ నేకాదశీదినమున నుపవసించి, ద్వాదశీదినమున ననేక భూసురులకుఁ గుడువఁబెట్టి, తాను బారణసేయఁ దలంచి యుండెను. రాజేంద్రుఁడు ద్వాదశీవ్రత మొనర్చునను వార్త తెలిసి, భోజనార్థమై యనేక భూసురులు వచ్చియుండిరి. అట్టిసమయమున దుర్వాసుఁడను మునీంద్రుఁ డతిథియై యంబరీషుని మందిరమునకు వచ్చెను.

అంబరీషుఁడు మునీంద్రునకు నమస్కరించి యనేక విధములఁ బూజించి, తన యింట నన్నంబు గుడువమని వేఁడెను. దుర్వాసుం డందులకు సమ్మతించి, కాళిందీ నదియందు

స్నానముసేయుట కరిగి యెంతసేపటికిని రాక తడసెను. ద్వాదశిపారణకు వేళ మించిపోవుచుండెను. ఆతఁడు రాకున్నఁ బారణఁజేసినచో ధర్మలోపంబగు నేమో యని నృపాలుఁడు భయంబందెను. ఏమిసేయుటకును నాతనికి మార్గము దోఁచ లేదు. అప్పుడాతఁడు వేదవిదులయిన బ్రాహ్మణులను జూచి యావిధం బెఱింగించెను. వా రాతనిం గాంచి "అతిథిరాలేదని ద్వాదశిపారణంబు మానుట పాడిగాదు. సలిలభక్షణము మంచి" దని పలికిరి. అంతట రాజేంద్రుఁడు హరిందలంచి జల పారణముఁజేసి దుర్వాసునిరాక కెదురు చూచుచుండెను.

కొంతసేఁపటికి దుర్వాసుఁడు వచ్చి యంబరీషుఁడు జల పారణంబుఁజేసెనని గ్రహించి, దురాగ్రహంబేర్చి 'అతిథినై వచ్చిన మునీంద్రుఁడ నగు నన్నుఁగూడ రమ్మని పిలిచి, నేను రాకుండఁ బారణఁ జేసితివిగా! నేను కోపించితినేని నన్ను వారింపగలవాఁడెవ్వఁ' డని పలికి యొకశక్తి నాతనిపై బ్రయో గించెను. దుర్వాసుని దుష్కృత్య మెఱింగి యాశక్తిని జక్క పెట్టుమని శ్రీహరి చక్రము నంపెను. వారిచేఁ బంపఁబడిన చక్రము వచ్చి దుర్వాసుని శక్తిని దహించి యాతని వెంటఁ బడెను. దుర్వాసుఁడు పరుగిడఁ దొడంగెను. అతఁడెచ్చటికి బోయిన జక్రము వెన్నాడుచునే యుండెను. మునీంద్రుఁడు తిన్నగా బ్రహ్మపాలికిబోయి చక్రానలజ్వాలల వారించి తన్ను రక్షింపుమని వేడెను. బ్రహ్మ యాతనిం జూచి "మునీంద్రా! సకల లోకములకును, నీకును, నాకును గర్తయైన శ్రీహరి చక్రమును నివారించుట కెవ్వరు శక్తులగుదురు? ఇందులకు నే నశక్తుఁడ" నని పలికెను అచ్చోటువాసి యాతఁడు కైలాస మునకుఁ బోయి శంకరునితోఁ జెప్పుకొనెను. అతఁడు గూడఁ

జతుర్ముఖుఁడు చెప్పినయట్లే చెప్పి శ్రీమన్నారాయణునే శర ణంబు వేఁడుమనెను. ఇఁక దుర్వాసునకు మఱియొక మార్గ మేమియు లేకపోయెను. ఆతఁడు తిన్నగా వైకుంఠమునకుఁ బోయి హరిం జేరి మ్రొక్కి ఇట్లు విన్నవించెను. "దేవా! పురాణపురుషా! నీ మహామహిమ నెఱుంగఁజాలక నీ భక్తున కెగ్గు జేసితిని. నా యపరాధము మన్నించి రక్షింపుము." దుర్వాసుని ప్రార్థనము విని యా యిందిరాకళత్రుండు కరుణ వహించి "ఓయీ తాపసా! నాభక్తుల కపరాధముఁ జేసిన వారు నా కపరాధముఁ జేసినవారే యగుదురు. భక్తుఁడెచ్చట నున్న నేనును నచ్చట నుందును.

క. సాధులహృదయము నాయది
సాధులహృదయంబు నేను ♦ జగములనెల్లన్
సాధుల నేన యెఱుంగుదు
సాధు లెఱుంగుదురు నాదు చరితము విప్రా!

నీవిప్పుడు తిన్నఁగాబోయి యంబరీషునే వేఁడికొనుము. ఆతఁడే నీకభయమిచ్చును" అని చెప్పిన విని యాతఁడు కడు రయమున నంబరీషునిఁ జేరి శరణంబు వేఁడెను. మహనీయుఁడగు దుర్వాసుఁడు తన్ను శరణంబు వేఁడుట కోఁడి, యంబరీషుఁడు హరిని మనంబునఁ దలఁచి శాంతింపుమని చక్రమునుస్తుతించెను. దుర్వాసుఁడు సంతసించి, యంబరీషునిహరిభక్తి ననేక విధం బులఁ బొగడి యాశీర్వదించి చనెను.

హరిఁ గొల్చువారికి సర్వశుభంబులును గలుగును. హరిభక్తుల కెగ్గుసేయువారి కాపదలు వచ్చును.

---

## ౪. రంతిదేవుఁడు

మ. "బలవంతమ్ముగ నీరుపట్టున నిజ♦ప్రాణాంతమై యున్నచో
నలయండేమియు వీనిహృజ్జ్వరమునా♦యాసంబు ఖేదంబు నా♦
జలదానంబున నేఁడు మానుననుచున్ ♦ సర్వేశ్వరాధీనుఁడై
జలముంబోసెనురంతిదేవుఁడుదయం♦జండాలపాత్రంబునన్."

రంతిదేవుఁ డను నృపాలుఁ డొకఁడు కలఁడు. ఈతఁడు పరమ భాగవతోత్తముఁడు. ఈతని పరిపాలనమున రాష్ట్రము నందు జనులు దరిద్రమను మాట నెఱుంగరు. తన యొద్ద కరుదెంచు దీనులకును, నర్థులకును గోర్కెలు దీర్చుటయే యీతని దీక్ష. భూసురసేవ, గురుజనార్చనము, ఆశ్రిత పోషణము, సత్యసంధత, ధర్మము, మొదలగు సద్గుణములే యీతనికి భూషణములు. ఆతని వదాన్యత త్రిభువన స్తవనీయమై యొప్పెను.

ఈతఁ డనేక సంవత్సరములు రాజ్యము బాలించి తుదకు సంసారమును విడిచి మహారణ్యమునకుఁ బోయి హరిని సేవించుచుండెను. ఒకప్పు డీతని కొక మాసము దినముల వఱకును నన్నమే లభింపలేదు. కడపటి దినమున వివిధ భక్ష్యములతో నిండిన భోజనము దొరకెను. ఆతఁడు దానిం దెచ్చుకొని యొక వృక్షము క్రింద బెట్టుకొని తినదలంచుచుండగా నొక భూసురుఁడు వచ్చి యన్నమడిగెను. అతనింజూచి రంతిదేవుఁడు సంతోషమంది, బ్రాహ్మణపూజ సమస్త పాపవిమోచన మని తలంచి, పూజించి, తాను తెచ్చుకున్న యన్నములో నర్థభాగ మాతనికి గుడువఁబెట్టెను. బ్రాహ్మణుఁ డన్నముదిని యరిగెను. తక్కిన సగపాలు రంతిదేవుఁడు భుజింప దలంచుచుండగా నొక

శూద్రుఁడు వచ్చెను. ఉన్న యన్నములో సగపాలు వానికిచ్చి పంపెను. మిగిలిన కొంచెమన్నము దినుటకు సంసిద్ధుఁడై యుండ మఱెవ్వఁడో వచ్చిన వానికిం బెట్టివేసెను. ఇఁక నాతనియొద్ద జలంబులు మాత్రమున్నవి. వానినైన ద్రావి కడుపునింపు కొన దలంచుచుండ, నొక చండాలుఁడు వచ్చి "అయ్యా! నీ వెవ్వఁడవో నాకు దెలియదు. తృష్ణాబాధ యధికముగ నున్నది. నాలుక లోపలికి బోవుచున్నది. నాయందు దయవహించి నా దప్పికఁ దీర్చి రక్షింపు" మని పలికెను. రంతిదేవుఁడు కొంచె మయిన విచారింపక భగవంతుఁడు తనచిత్తము నీ విధముగాఁ బరీక్షించుచుండెఁ గాఁబోలు" నని తలంచి వానింగాంచి "నాయొద్దమిగుల మధురములయిన జలములే యున్నవి. తనకు లేకపోయినను నితరులకు బెట్టినవారిజన్మమే జన్మము. అట్లొన ర్చిన వారికిఁ బరమేశ్వరుఁడు సర్వదా శుభంబులఁ గూర్చు"నని పలికి తనయొద్దనున్న జలములు వానికిఁబోసి దప్పిఁదీర్చెను. త్రిమూర్తులాతనిభక్తికిని, ధైర్యమునకును సంతసించి ప్రసన్నులై "రంతిదేవా! నీ యుదారగుణమునకు మేమెంతయు సంతసించి తిమి. నీ చిత్తమును బరిశోధించుటకే మేమట్టి రూపంబులవచ్చి నిన్నర్థించితిమి. భక్తాగ్రగణ్యుఁడ వగు నీకు శుభంబులు గలు గుఁగాక" యని పలికి యాతనికి వరములిచ్చి యంతర్ధానులయిరి. రంతిదేవుఁడు హరినిగూర్చి పెక్కేండ్లు తపంబొనర్చి, తుదకా దేవదేవుని యనుగ్రహమున ముక్తిని బొందెను.

---

# ౫. అక్రూరుఁడు

ఉ. ఎట్టితపంబు సేయఁబడె ♦ నెట్టి చరిత్రము లబ్ధమయ్యెనో
యెట్టిధనంబు లర్హులకు ♦ నీఁబడెనో తొలిబామునందు నా
యట్టి వివేకహీనునకు ♦ నాదిమునీంద్రులు యోగదృష్టులం
బట్టగలేని యీశ్వరుని ♦ బ్రహ్మమయున్ హరిఁజూడగల్గెడిన్.

అక్రూరుఁడు కృష్ణునకు బరమభక్తుఁడు. ఈతఁడు బాల్యమునుండియు సద్గుణములు గలిగి యొప్పుచుండెను. కాని యీతఁడు మధురాపురంబున లోకకంటకుఁడయిన కంసుని సేవయందుండెను. కంసుఁడు మహాక్రూరచిత్తుఁడు. బలరామ కృష్ణులకు మేనమామ. అక్రూరుఁడు కంసుని సేవయందుండె ననుమాటయేగాని యెన్నడును క్రూరకృత్యములుగాని, యధర్మ కార్యములుగాని యాచరించి యెఱుఁగఁడు. కంసుఁడుగూడ నీతని విమలవర్తన మెఱింగి యున్నవాఁ డగుటచే దుష్టకార్యములు సేయుటయం దెప్పుడును నియమింపక యుండెను. ధర్మము, సత్యము, గురుజనసేవ మొదలగుసద్గుణము లక్రూరున కుగ్గుపాలతోఁ బెట్టఁబడినవి.

గోకులంబున నున్న బలరామ కృష్ణులవలనఁ దనకు గీడు మూడునని తలంచి, ధనుర్యాగ మను నెపమున వారిని మధురకుఁ దోడితెమ్మని కంసుఁ డక్రూరుని నియమించెను. కంసుఁడు దుర్బుద్ధిఁబూనియే రామకృష్ణులను దేరఁ దన్నుబంచు చుండెనని యెఱుంగును. కాని నృపాలుని యాజ్ఞ కాతఁడు వ్యతిరేకముగా వర్తించువాఁడు కాఁడు. బృందావనమునకుఁ బొమ్మని తన కాజ్ఞనొసంగిన కంసునిఁ జూచి యక్రూరుఁడు

"మహారాజా! నీ యానతి శిరంబునఁ దాల్చి బృందావనమున కరిగి బలరామకృష్ణుల నిటకు దోడ్కొనివచ్చెదను. దైవయోగ మెట్లున్నదో యట్లగు" నని పలికి రథంబెక్కి బయలుదేఱెను. మార్గమం దాతఁడు కంసుఁడు బలరామకృష్ణులకు హానిఁగూర్ప దలంచిన విషయమును గూర్చి పరిపరి విధముల యోచించెను. భగవత్స్వరూపులగు వసుదేవాత్మజులఁ జూడఁ బోవుచుంటి నని సంతోషించెను. అతఁడు తన చిత్తమున "నేను పూర్వభవమున నెంతయో సుకృతముఁ జేసికొని యుంటిని. అందుచేతనే పరమ నిష్ఠాగరిష్ఠులై, యరణ్యంబులయందుండి ఘోరతపముఁ జేయు యోగీంద్రుల కయినను దుర్లభుండయిన కృష్ణుని జూడబోవు చుంటిని. ఎవ్వనిపాదంబు లాశ్రయించి భక్తులు భయంకర సంసారవార్ధిఁ దరించుచుందురో, యట్టి శ్రీహరియగు వాసు దేవుని వైరముచేతఁ దనకడకుఁ దోడ్కొని రమ్మని కంసుఁడు నన్ను నియమించినాఁడు. కాని నాచిత్తముమాత్ర మనేక సంశ యము లందుచున్నది. దురాత్ముఁడగు కంసుని పంపునఁగదా నేను పోవుచుంటిని. ఆతనిపంపున నీతఁ డరుదెంచె నని నన్నాగ్ర హించునో! లేక దయబూని యాదరించునో! ఇంతకును నా పుణ్యమెట్లుండునో" యని తలంచుచు సాయంసమయమునకు బృందావనమునకుఁ జేరెను. ధేనువులు తమ వత్సములతో గృహములకు మరలిపోవుచుఁ జేయు సంబారవములు, అటునిటు పరుగెత్తు గోవులను మరలించు గోపాలకుల కేకలు మొద లగునవి చూచి యానందమందుచు నక్రూరుఁడు నందుని గృహమును సమీపించి రథము దిగి లోపలికేగెను.

అప్పుడు బలరామకృష్ణు లందే యుండిరి. అక్రూరుఁ డామహాత్ములగాంచి భక్తిపూర్వకముగ నమస్కరించెను. వా

రతనిని బెక్కువిధంబుల గౌరవించి కుశలప్రశ్నంబులఁ జేసిరి. భోజనానంతరమునఁ గృష్ణుఁ డక్రూరుని రాకకు గారణం బడిగెను. "మీమేనమామయగు కంసుఁడు ధనుర్యాగము సేయఁబూని మిమ్ములఁ దోడ్కొని రమ్మని నన్నుఁ బంపెను" అని యాతఁడు బలికెను. కంసుఁడు తమ్మెవిధముగానయిన హింసించుటకు యీ ధనుర్యాగము దలపెట్టి యక్రూరునిఁ బంపెనని కృష్ణునకుఁ దెలియును. కాని లోకరక్షకుండగు నాతనికిఁ గంసునివలన భయమేమున్నది? కంసునకు వినాశకాలము సమీపించుటచేతనే తన్నుఁబిలువఁబంచినాఁడని వాసుదేవుఁడు మనంబునఁ దలఁచి నందాదులంజూచి యిట్లు పలికెను. "ధనుర్యాగమహోత్సవము దిలకించుటకుఁ గంసుఁడు నన్నురమ్మని యీ యక్రూరునిచే వార్త బంపినాఁడు. ఆతఁడు మనకుఁ బ్రభువగుటచేఁ గానుఁకగా నిచ్చుటకు నెయ్యి, పాలు మొదలగునవి సిద్ధముఁ జేసికొని, మధురకుఁ బ్రయాణము సాగింపుడు." కృష్ణునియానతి ననుసరించి నందాదు లామఱునాఁడు మధురకుఁ బ్రయాణమైరి. బలరామకృష్ణు లక్రూరునిరథముపై నెక్కిరి. మధ్యాహ్నసమయమునకు రథము కాళిందీ నదీతీరమునుజేరెను. బలరామకృష్ణులు రథమునచ్చట నాపి, దాహము దీర్చుకొనివచ్చి మరల రథముపై నాసీనులయిరి. అనంతరమక్రూరుఁడుగూడ జలములు ద్రాగివచ్చుటకు నదిలోనికి బోయెను. అతఁడు జలంబులను ద్రాఁగుచుండఁగా నందు బలరామకృష్ణు లాతనికిఁ గనుపించిరి. అందుల కాతఁడద్భుతము నంది తనదృష్టి రథముపై నిలిపి చూచెను. వారు రథము మీఁదనేయుండిరి. అక్రూరుఁడు కృష్ణునిమహిమ కత్యద్భుతము నంది, యద్దేవదేవు ననేకవిధముల స్తుతించి రథమెక్కెను.

కృష్ణుఁడు మధురకేఁగి కంసుని వధించెను. నాటినుండియు నక్రూరుఁడు కృష్ణుని గొలుచుచుండెను.

ద్వారకాపురమున సత్రాజిత్తను నతఁడు తనపుత్రిక యగు సత్యభామను కృష్ణున కొసంగెనని క్రోధము వహించి శతధన్వుఁ డెట్లయిన సత్రాజిత్తునకు హానిగూర్ప సమయమునకై వేచియుండెను. ఇట్లుండ బలరామకృష్ణు లొకప్పుడు హస్తినాపురమున కేఁగిరి. ఇదియే సమయ మని తలంచి శతధన్వుఁడు సత్రాజిత్తునుఁజంపి యాతనియొద్దనున్న మణి నపహరించి, కృతవర్మ యనువానిం జేరి, కృష్ణునితో యుద్ధము సేయుటకుఁ దనకు సహాయముగమ్మని యడిగెను. కృతవర్మ యందులకు సమ్మతింపలేదు. అంతట నాతఁడక్రూరునడిగెను. పరమభక్తాగ్రేసరుఁడగు నక్రూరుఁడు హరితో గయ్యముసేయుటకు సమ్మతించునా! ఆతఁడు శతధన్వుని విలోకించి యిట్లు పలికెను. “నీవెంత యవివేకివయితివి! వాసుదేవు నెవ్వనిగా భావించితివి? సృష్టిస్థితిలయకారణుం డగు శ్రీమన్నారాయణునిగా నెఱుంగుము. ధరాభారము బాపఁదలంచి శ్రీహరియే కృష్ణరూపమున యాదవకుల క్షీరజలధి పూర్ణచంద్రుఁడై జనించినాఁడు. అట్టిమహనీయుని నేనుభజింతును. సేవింతును. ఆతని పాదములకు మ్రొక్కుదును.” ఇఁక శతధన్వున కేమియు మార్గము దోఁచలేదు. కృష్ణుఁడు హస్తినాపురమునుండి వచ్చి శతధన్వునివలన సత్రాజిత్తు వధింపఁబడెనని విని యాతని యంతముఁ జూచితీరును. ఈ విషయమునుగూర్చి శతధన్వుఁడు భయంబంది, తాను సత్రాజిత్తును జంపి కైకొన్న మణి నక్రూరునియొద్ద దాచి, ద్వారకానగరము విడిచి యెచ్చటికో పాఱిపోయెను.

సత్యభామ హస్తినాపురమునకేగి శతధన్వుఁడు తన తండ్రిఁజంపి మణి నపహరించి యెటకో పాఱిపోయినాఁడని కృష్ణున కెఱింగించి దుఃఖించెను. కృష్ణుఁ డామె నూరడించి, చక్రధారియై రథంబెక్కి బయలుదేఱి శతధన్వు నన్వేషించుచుఁ బోయి యొకచోట వానింగాంచి, చక్రమున వాని శిరముఁ ద్రుంచెను. కాని వానిదగ్గఱ మణిమాత్రము లేదు. శతధన్వుఁడు హరిచే గూలుట విని తనకడ మణియున్న కారణమున భయమంది, యక్రూరుఁడు ద్వారక విడిచి చనెను. అక్రూరుఁడు పురము విడిచిననాటనుండియు క్షామము సంభవించెను. పెక్కులుత్పాతములు దోఁచెను. ఇందులకుఁ గారణ మేమై యుండునని కృష్ణుఁడు పెద్దలతో యోజింప వారిట్లనిరి "నందనందనా! పూర్వము వారణాసిపురమున క్షామము సంభవించెను. అప్పుడు తన్నగరాధీశుఁ డక్రూరుని తండ్రియగు శ్వఫల్కునిఁ గొని పోయి తన తనూజాత నాతని కొసంగి పరిణయము గావించెను. శ్వఫల్కుఁడు వారణాసి ప్రవేశించిన యంతనే వర్షములు గురిసెను. పుడమి సమస్త సస్యసమృద్ధయై యొప్పెను. కఱవు నశించెను. మన యక్రూరుఁడు గూడ తండ్రియంతటివాఁడు. అక్రూరుఁడు మనపురమువిడిచి యరిగిన నాఁటనుండియు, మన కిట్టిద సంభవించినది. కావున నీవెట్లయిన నాతని రావింపుము." కృష్ణుఁడు వారిమాటలు విని యాక్షణముననే చారులను బంపి యక్రూరుని ద్వారకానగరమునకు రావించి గౌరవించెను. అనంతరము కృష్ణుఁ డక్రూరునిఁ జూచి నెమ్మదిగా "అక్రూరా! శతధన్వుఁడు నీయొద్ద మణి దాచినాఁడని నేను వినియుంటిని. అందలి నిజము నెఱుంగక దానిని నేనే యపహరించి యసత్యము బలుకుచుంటి నని మా యగ్రజుఁడు తలంచుచున్నాఁడు. కావున

మాయన్న సందేహముఁబాపి యమ్మణిని నీవే యుంచుకొ నుము" అని పలికెను. అక్రూరుఁడు జరిగిన వృత్తాంతమంతయు కృష్ణున కెఱింగించి తనయొద్దనున్న మణి హరికి సమర్పించి ద్వారకయందుండెను. అక్రూరుఁడు ద్వారకఁ బ్రవేశింపఁగనే క్షామ మడంగెను. నాఁటనుండియునక్రూరుఁడు కృష్ణునివిడువక సేవించుచు నాతని యనుగ్రహమునకుఁ బాత్రుఁడై భక్తులలో ముఖ్యుఁడయ్యెను.

# ౬. నృ గు మ హా రా జు

ఆ. "కృష్ణ వాసుదేవ ♦ కేశవ పరమాత్మ
అప్రమేయ వరద ♦ హరి ముకుంద
నిన్నుఁ జూడఁ గంటి ♦ నీకృపఁ గనుగొంటి
నఖిల సౌఖ్య పదవు ♦ లందఁ గంటి."

పూర్వము ఇక్ష్వాకునకుఁ దనూజుఁడగు నృగుఁడను నొకరాజు కలఁడు. ఆతఁడు ధర్మసంధుఁడై రాజ్యపరిపాలనము సేయుచు ననేక యాగములనుజేసి, వసుధామరకోటి ననేక విధములయిన దానంబుల నొసర్చి యధిక విఖ్యాతి నందెను. ఆతఁడు భూసురులకు దానముగ నిచ్చిన గోవులను గణుతించుట కెవ్వరును శక్తులుగారు. ఆతఁడు వాపీకూప తటాక వనము లనేకములు నిర్మాణము జేయించెను. ఇట్లుండ నొక్కనాఁడు కశ్యపుఁడను బ్రాహ్మణున కొక గోవును దానముగ నిచ్చెను. ఆగోవు తప్పివచ్చి రాజేంద్రుని గోవులమందలోఁ జేరెను. నృగుఁ డాసంగతి తెలియక యా గోవును మరల నింకొక

భూసురునకు దానముగ నిచ్చెను. ఈ విప్రుఁడాగోవును దనగృహమునకుఁ దీసికొని పోవుచుండగా, మొదటదానముఁ గొన్న కశ్యపుఁడు వచ్చి యాతనింగాంచి 'నాగోవును నీ వేల దీసికొని పోవుచుంటివి ?' అని రోషముతోఁ బలికెను. 'మహా రాజు నాకు దీనిని దానముగా నిచ్చె' నని యా బ్రాహ్మణుఁడు ప్రత్యుత్తర మిచ్చెను. ఆ యిరువురు బ్రాహ్మణులును దాని విషయమై ఘోరముగాఁ గలహించి తుదకు నృగునికడకుఁ బోయిరి. కశ్యపుఁడు రాజుం జూచి యిట్లుపలికెను. "రాజేంద్రా! సకల ధర్మములను గాపాడుచున్న నీవు నేఁడు ధర్మముఁ దప్పి చరించితివేల ? నాకు దానమిచ్చిన యావు నీ మందలోఁ దప్పి వచ్చి కలియుగాక ! దానిని మరల నీ బ్రాహ్మణున కేమని దానమిచ్చితివి? ఇట్టివాని నేమందును?"అని పలికిన వినినృపాలుఁ డాతనిం గాంచి వినయముతో "భూసురోత్తమా ! నన్ను మన్నింపుము. నేనీవిషయ మెఱుంగక యపరాధముఁ గావించి తిని. నేను నరకకూపంబునఁ బడకుండ రక్షింపుము. దీనికి బదు లుగా నీకొక లక్షగోవుల నొసంగెద" ననెను. కశ్యపుఁ డందు లకు సమ్మతింపలేదు. నాకుఁ దొలుత నిచ్చిన గోవునే యొసంగ వలయునని గట్టిగాఁ జెప్పెను. అంతట నృగుఁడు రెండవబ్రాహ్మ ణునిఁ బ్రార్థించెను. ఆతఁడును సమ్మతింప లేదు. కశ్యపుం డాగ్రహముతో వెడలిపోయెను. రెండవ బ్రాహ్మణుఁడు తన కిచ్చిన గోవును దీసికొని పోయెను.

కొన్నాళ్ళకు నృగుఁడు మరణించెను. యమకింకరులు వానిం గొనిపోయి దండధరుని ముందుఁ బెట్టిరి. ఆతఁడు నృగునిఁ జూచి,

మ. "మనురాజేంద్రోత్తమ ! వంశపావనజగ ♦ న్మాన్యక్రియాచార నీ
ఘనదాన క్రతుధర్మముల్ త్రిభువన♦ ఖ్యాతంబులై చెల్లెడిన్
మనుదుష్కర్మఫలంబునొంది పిదపం ♦ బుణ్యానుబంధంబులై
చనుసౌఖ్యంబులఁ బొందుపద్మజుని యాజ్ఞంద్రోవఁగావచ్చునే."
అని పలికి భూమిం బడఁద్రోయించెను.

అట్లు నేలకుఁ ద్రోయబడిన యానృపాలుఁడు ఊసరవెల్లి రూపమును గైకొని ద్వారకాపుర ప్రాంతమున నొక జల రహిత కూపమునఁ బడియుండెను. ఇట్లుండఁ గొన్నాళ్ళకా కూపము దరికి శ్రీకృష్ణుని పుత్రులగు ప్రద్యుమ్నాదులు వచ్చి యా. యూసరవెల్లింగాంచి కొండవలెనున్న దానిరూపమునకచ్చెరువుఁ బొంది దానినందుండి వెడలించుటకుఁ బాశంబుల గట్టిలాగిరి. కాని యది కదలలేదు. అప్పుడు వారు కృష్ణుని సన్నిధికిఁ బోయి యావృత్తాంతము నెఱింగించిరి. వాసుదేవుఁ డయ్యెడ కరుదెంచి, యూసరవెల్లింగాంచి,యొకతృణముచే దాని నీవలకు వెడలించెను. వెంటనే యా యూసరవెల్లి నృగుఁడై నిలిచి కృష్ణునకు నమస్కరించి "దేవా! నీయనుగ్రహామువలన నా దుస్థితిఁబాసి పూర్వరూపముఁ గాంచితిని. నన్ను నీభక్తునిగా నేలి నిరంతరము నా హృదయపద్మమున నుండుము" అని పలికి భగవదనుగ్రహామున దివ్యవిమానమెక్కి దివంబున కరిగెను.

---

## ౭. భీష్ముఁడు

సీ. కుప్పించి యెగసినఁ ♦ గుండలంబులకాంతి
గగనభాగంబెల్ల ♦ గప్పికొనఁగ
నుఱికిన నోర్వక ♦ యుదరంబులోనున్న
జగముల వ్రేగున ♦ జగతి గదలఁ
జక్రంబుఁ జేపట్టి ♦ చనుదెంచు రయమున
బైనున్న పచ్చని ♦ పటముజాఱ
నమ్మితి నాలావు ♦ నగుబాటు సేయకు
మన్నింపుమని క్రీడి ♦ మరలఁ దిగువ

తే. గరికి లంఘించు సింహంబు ♦ కరణి మెఱసి
నేఁడు భీష్మునిఁ జంపుదు ♦ నిన్నుఁ గాతు
విడువు మర్జున యనుచు మ ♦ ద్విశిఖవృష్టిఁ
దెరలి చనుదెంచు దేవుండు ♦ దిక్కునాకు.

భీష్ముని పితృభక్తి యనుపమానమైనది. పితృవాక్య పరిపాలనార్థము రాముఁడు నిజరాజ్యసంపదలను విడిచి భార్యతో నడవులకు బోయెను. భీష్ముఁడు తండ్రికొఱకు వివాహమునే మానెను. ఈ భీష్ముఁడు వసిష్ఠుని శాపవశమున గంగయందు హస్తినాపురాధీశుఁ డగు శంతనునృపాలునకు జనించినాఁడు. ఈతఁడు పరశురామునియొద్ద సమస్తవిద్యలను నభ్యసించి మహాబలపరాక్రమవంతుఁడై యొప్పుచుండెను. యువరాజ పదవియందున్న యాతని శౌర్యమును జూచి రాజులెల్లరును భీతిఁబొందుచుండిరి. శంతనుఁడును గుమారుని శౌర్యపరాక్రమముల కచ్చెరువుఁ బొందుచుండెను. యౌవన వయస్కుండైన భీష్ముఁడు

రాజకార్యములందుఁ బాల్గొనుచుఁ దండ్రికి విశేషము శ్రమ లేకుండ హస్తినాపుర సామ్రాజ్య రథమును జక్కఁగా నడుపుచుండెను.

ఇట్లుండ నొక్కనాఁడు శంతనుఁడు మృగయావ్యాజంబున యమునాతీరంబున కరిగి యచ్చట నోడనడుపుచున్న దాశరాజు పుత్రికగు మత్స్యగంధిని తిలకించి, తత్సౌందర్యమున కద్భుత మంది, మోహితుఁడై యామె తండ్రికడ కరిగి, యామెను దన కిచ్చి వివాహము సేయుమని కోరెను. అందులకు దాశరాజు శంతనునిఁజూచి "విశ్వంభరా కళత్రా! నీయట్టివానికిఁ దనూజ నిచ్చుట నాకు సుకృతమే. నేను ధన్యుఁడనగుదును. కాని నాకు మాత్ర మొకయభీష్టము కలదు. నీ వీ కన్నియను ధర్మపత్నిగా గ్రహింపఁదలఁచినవాఁడ వేని, యీయామెయం దుదయించు కుమారుని రాజుగాఁ జేయుదునని వాగ్దానమిమ్ము. నీయభీష్టము ననుసరించెద" నని పలికెను. దాశరాజు కోరికఁ దీర్చుటకై శంతనుఁ డెట్లు సమ్మతించును? యువరాజ పదవియందున్న గాంగేయుఁడు కలఁడుకదా! ఆతనిందలఁచి శంతనుఁ డేమియుఁ బ్రత్యుత్తర మీయజాలక "ఈ వరముదప్ప మఱియొండు కోరుకొనుము" అనెను. దాశరాజందులకు సమ్మతింపలేదు. శంతనుఁడు విగతమనోరథుఁడై నిజపురమునకు మరలివచ్చెను. ఆతఁడునగరమును జేరెననుమాటయేగాని, సత్యవతియందు గలిగిన మోహముచే నిద్రాహారములకు దూరుఁడయ్యెను. రాజకార్యము లన్నియు మఱచెను. నానాఁటి కతఁడు శుష్కించుచుండెను. ఎప్పుడును మత్స్యగంధి విషయమై చింతలో మునిఁగియుండెను. రాజేంద్రుఁ డీస్థితియందుండుటకుఁ గారణ మెఱుంగక మంత్రులెల్లరును ననేకవిధములఁ దలఁచుచుండిరి. తండ్రి దుస్థితిఁజూచి

గాంగేయుఁడు నెమ్మదిగా నాతనిం జేరి యిట్లు పలికెను. "జనకా! నీవు వేటకుఁబోయి వచ్చిననాటనుండియు దీర్ఘచింతలోఁ మునింగి యుంటివి. ఇందులకు గారణము నా కావంతయు దోఁచకయున్నది. సామంతరాజులెల్లరును నీకు విధేయులై యుండిరి. ప్రజలు సుఖముగా నుండిరి. ఇట్టియెడ నీచింతకుఁ గారణమేమి?" యని యడిగెను. శంతనుఁడు కుమారుని పలుకులు విని యిట్లు చెప్పెను. "పుత్రా! ఏకపుత్రుఁడును, అనపత్యుఁడును నొక్కటే విధమని శాస్త్రమందుఁ జెప్పబడి యున్నది. నీవు మహాపరాక్రమవంతుఁడవు. అతిసాహసుఁడవు. రణకోవిదుఁడవు. నీయునికి నమ్మరాదు. అందుచే వివాహమాడి యింకను దనయులఁ బడయవలయునని కోరిక యున్నది."

భీష్ముఁడు తండ్రిమాటలు విని మంత్రిపురోహితబృందముతో యోచించి రాజేంద్రుని చిత్తము సత్యవతియందు లగ్నమై యుండుట గ్రహించి, దాశరాజుకడ కేఁగి 'నీ తనూజయగు సత్యవతిని మాతండ్రికొసంగి పరిణయము గావింపు' మని కోరెను. అప్పలుకులు విని దాశరాజు గాంగేయుని విలోకించి "గాంగేయా! నీవు జనకార్థమై కన్యార్థివై వచ్చితివి. నీ పితృభక్తికి నేనెంతయు సంతసించితిని. నేను ధన్యుఁడనైతిని. నీ రాకచే నీప్రదేశమంతయు బావనమైనది. నాకు మీవంటివారి సంబంధము పడయుటదుస్తరము. కాని యిందు సాపత్న్యదోషం బొకటి యున్నది. అయ్యది నీచేత నివారింపఁ బడవలయును. నీ వలిగితివేని హరిహరులయినను నోర్వఁజాలరు" అని పలికెను. దాశరాజు పలుకులయందలి భావమును గాంగేయుఁడు గ్రహించి "దాశరాజా! నీ విందులకు సందేహ మందవలదు. నా తండ్రికొఱకు నేను శపథముఁ దాల్చుచున్నాఁడ. నీ

తనూజ యగు సత్యవతియందు జనించిన కుమారుఁడే హస్తినాపుర సామ్రాజ్యలక్ష్మికి భర్త కాఁగలఁడు. అతఁడే కౌరవకుల స్థితి కారణుఁ డగునని పలికెను. ఈ మాటలతో దాశరాజు తృప్తిసందక భీష్మునిఁ జూచి మరల నిట్లనెను. "భాగీరథీ కుమారా! నీవు సమస్తధర్మసంవేదివి కావున నిట్లు పలికితివి. నీవు చేసిన శపథమునకు భంగము సేయవు. కాని నా కొక విషయమున సందియము వొడముచున్నది. నీ కుదయించు కుమారు లిందులకు సైరించి యుందురా?" యనిన, నచ్చటి వారెల్ల వినుచుండ భీష్ముఁడు "ఇదిగో! నేను బ్రహ్మచర్య వ్రతము స్వీకరించితిని. ఇట్లే నా జీవయాత్ర వెడలఁదీర్చెద" నని ప్రతిన దాల్చెను. ఇట్టి ఘోరమైన ప్రతిజ్ఞచే దాశరాజు నొప్పించి, భీష్ముఁడు సత్యవతిని దనతండ్రికి వివాహముఁ జేయించెను. తనకొఱకు బ్రహ్మచర్యవ్రతముఁ బూనిన కుమారుని భక్తికి సంతసించి శంతనుఁ డాతనికి స్వచ్ఛందమరణము వరముగా బ్రసాదించెను. ఆహా! భీష్ముని పితృభక్తి వర్ణనీయము గదా! సమస్త భాగ్యభోగ్యంబుల కాటపట్టయిన రాజ్యమును, నైహికసుఖముల కాలవాల మయిన వివాహమును బరిత్యజించి తన యశోడిండిమము దశదిగ్భాగముల మ్రోగునట్లుచేసెనుగదా!

సత్యవతియందు శంతనునకుఁ జిత్రరథ, విచిత్రవీర్యులను నిరువురు కుమారులు జనించిరి. వీరిరువురును యుక్తవయస్కులు గాక పూర్వమే శంతనుఁడు మరణించెను. భీష్ముఁడు వారిని బెంచి పెద్దవారుగఁ జేసెను. చిత్రరథుఁడు వివాహము గాక పూర్వమే మృతినొందెను. భీష్ముఁడు కాశీరాజ పుత్రికలగు నంబికాంబాలికలను దెచ్చి విచిత్రవీర్యునకు వివాహముఁ

జేసెను. ఈ విచిత్రవీర్యుని సంతానమే ధృతరాష్ట్ర పాండురాజులు. ధృతరాష్ట్రుఁడు యుక్తవయస్కుఁడైనంతనే భీష్ముఁ డాతనిని రాజుగాఁ జేసెను. మహాబల పరాక్రమవంతుఁడైన పాండురాజు రాజ్యమును సర్వవిధముల రక్షించుచుండెను. ధర్మ భీమార్జున నకుల సహదేవులను నేవుర పుత్రులం బడసి పాండురాజు స్వర్గస్థుఁ డయ్యెను. ధృతరాష్ట్రునకు దుర్యోధన దుశ్శాసనాదులను నూర్వురు పుత్రులు జనించిరి.

## భారతయుద్ధము

రాజ్యభాగమును గూర్చి కౌరవ పాండవులకు ఘోర యుద్ధము పొసఁగెను. ఇందు భీష్ముఁడు కౌరవపక్షముననుండెను. అట్లున్నను నాతఁడు ధర్మమునందే బుద్ధి నిలిపి యుండెను. రణమున నాతఁడు పెక్కండ్ర యోధుల నుక్కడఁగించెను. ఒక నాఁటి యుద్ధమున నీతఁడు పూర్తిగ శౌర్యంబున విజృంభించి పాండవసైన్యములను జీకాకు పఱచుచుండెను. అట్టి సమయమున నాతని నెవ్వరును మార్కొనుటకు శక్తులుగాకయుండిరి. అర్జునుఁడుగూడ భయమొందెను. అప్పుడు కృష్ణుఁ డర్జునున కుద్రేకముఁ గలిగించుటకు, తాను రణమునఁ జక్రముఁబట్టనని ప్రతిజ్ఞఁ జేసియున్నను, గోపోద్రేకియై చక్రముఁ బట్టి "నేఁడు భీష్మునిఁ దెగటార్చెద" నని పలుకుచు రథమునుండి నేలకు లంఘించెను. భీష్ముఁ డందులకు భయమందలేదు. అతనికిఁ గృష్ణునియం దద్వితీయమైన భక్తికలదు. భీష్ముఁడు కృష్ణుని సంరంభమునుజూచి నిర్మలమైన భక్తినిఁ బ్రకటించుచు గరంబులు మోడ్చి యిట్లుపలికెను. "కృష్ణా! చక్రము ధరింపనని ప్రతిజ్ఞఁజేసి దానికిప్పుడు భంగమొనర్చి చక్రముఁ బట్టినంత

మాత్రమున నేను భయమందను. కేశవా! అశాశ్వతమగు నీతనువున కాశించువాఁడఁ గాను. నీవు నాతోఁ గయ్యముఁ జేయఁ దలఁచుట నా పూర్వపుణ్యఫలమని భావింతును. నంద నందనా! నేఁడు నాతల్లియగు గంగామహాదేవి వీరమాత యగును. పరశురాముఁడిచ్చిన శరవిద్య పావనం బగును. ముకుందా! సంశయింపక నన్ను మార్కొని భవదీయచక్రమున నాకంఠమును ఖండించి ముక్తి నొసంగుము.'' భీష్ముని పలుకులు విని కృష్ణుఁడు ముందున కడుగు వేయలేకపోయెను. ఇది యంతయు నర్జునుని రణమునకుఁ బ్రోత్సాహపఱచుటకే కదా!

## —♦ నిర్యాణము ♦—

యుద్ధమున నీ భీష్ముఁ డనేకవీరుల సంహరించి, తుద కర్జునుని చేతిలోఁ గూలెను. ఈతఁడు తండ్రియిచ్చిన వరప్రభావమున శుభదినము వచ్చువఱకును శరీరమునఁ బ్రాణములు దాల్చి, యంపశయ్యనుండి కృష్ణుని యనుమతిని ధర్మజున కనేక నీతులు దెలిపి, యేకాదశీదినంబున దేహము విడిచెను. ఈతఁడు స్వర్గస్థుఁడైనదిన మతిపావనమై 'భీష్మైకాదశి' యని యొప్పుచున్నది. పితృభక్తి, రాజభక్తి, దైవభక్తి మున్నగునవి యీ మహనీయుని చరితమువలన మనము గమనింపవలసిన ముఖ్య విషయములు గదా!

# ౮. పరీక్షితుఁడు

పరీక్షితుఁ డుత్తరయను కాంతయం దభిమన్యునకు జనించినవాఁడు. పాండవు లీతనికి హస్తినాపుర రాజ్యాభిషేకముఁగావించి మహాప్రస్థానమున కరిగిరి. ఈతఁడు ధర్మము తప్పక మహాభాగవత శేఖరుఁడై రాజ్యపాలనము సేయుచు, నిరావతి యను కాంతం బెండ్లియాడి జనమేజయుఁడు మొదలగు కొడుకుల నల్వురఁబడసి కృపాచార్యుని గురుత్వంబున గంగాతీరంబున ననేకయాగములఁజేసి, దిగ్విజయార్థము బయలు దేఱెను. అట్టిసమయమున గంగాతీరమున నొక్క ప్రదేశమున వృషభరూపమున నున్న ధర్మదేవుఁడును, గోరూపమున నున్న ధాత్రియు, 'కృష్ణుఁడు ప్రపంచము విడిచి చనిన కారణమున నధర్మములు హెచ్చుచుండె' నని సంభాషించుకొనుచుండిరి. పరీక్షితుఁడు వారిని సమీపించి యా సంభాషణ వినుచుండ రాజలక్షణ ముద్రితుండైన యొకఁడు కడురయమున వచ్చి యా ధేను వృషభముల నిర్దయుఁడై తన్నఁ దొడంగెను. పరీక్షితుఁడు వానింజూచి యాగ్రహోయత్తచిత్తుఁడై యొరనుండి కరవాలముఁ దీసి సమీపించి "ఈ ధేను వృషభములు నీకేమి యపకారముఁ జేసినవి? వీనిం దన్నుటకుఁ గారణమేమి? మద్భుజబలపరిరక్షితమైన భూమియం దధర్మములు జరుగఁగూడదను సంగతి నీకుఁ దెలియదు కాఁబోలు! నీ వెవ్వఁడవు? నిన్ను శాసించెదను" అని పలికి వెండియు ధేనువృషభంబుల ననేక విధంబుల నొదార్చెను. అడిదంబు వెడిదంబుగ జడిపించిన యభిమన్యునందనునిఁ జూచి కలిపురుషుఁడు గడగడ వడఁకదొడంగెను. నృపాలుడు వానిం గాంచి "అర్జునపౌత్రుండగు నీతఁడు భయమందినవారిని జంపడు. నీవు పాపచరిత్రుఁడవు. మదీయబాహు పాలితంబయిన ప్రదేశంబుల నుండదగవు. ప్రాణివధ, స్త్రీ, ద్యూత, పానంబు

లను నాలుగుస్థలముల యందును, నసత్య మద కామ హింసా వైరంబులను పంచస్థానంబులయందును నీ వుండు" మని చెప్పి వానిని బంపివేసి, ధర్మదేవునకును భూదేవికిని సంతోషముఁ గలుగఁ జేసెను. ఇట్లు కలినిగ్రహముఁ జేసి యా రాజేంద్రుఁడు నిజపురమునకు వచ్చి సుఖముగా రాజ్యపరిపాలనము సేయుచుండెను.

## —♦ శాపము ♦—

ఇట్లుండ నొక్కనాఁ డా భూరమణుఁడు మృగయావిహారమున కరణ్యమునకుఁ బోయి వేటాడి యలసి దాహపీడితుఁడై మార్గముఁ దప్పి చరించుచు నొక్క ప్రదేశమునఁ గన్నులు మూసికొని తపముం జేసికొనుచున్న శమీకుఁ డను మహర్షిని గాంచి, యాతనిని సమీపించెను. అతఁడు తపస్సునం దుండుటచే రాజును జూడలేదు. 'నాకు దప్పి యగుచున్నది. జలములి' మ్మని గట్టిగా నడిగినను నృపాలుని మాటలు మునీంద్రుఁడు వినిపించుకొనలేదు. అమ్మునీంద్రుఁడు నిమీలితనేత్రుఁడై హరిధ్యానంబుననున్న సంగతిఁ దెలియలేక పరీక్షితుఁడు తన మనంబున "అక్కటా! భూకళత్రుఁడనగు నే నరుదేర నన్నుంగాంచి యీ ముని సంభాషింపక యున్నవాఁడు. దాహమైన నొసంగక యున్నాఁడు. ఋషియగు వీనికింత గర్వమా?" యని తలంచి యలుక వహించి, యచ్చటనున్న మృతసర్పమును వింటికొప్పునఁ దెచ్చి మునీంద్రుని మెడపై వైచి పురంబునకు జనెను.

కొంతసేపటి కచ్చటికి శమీకుని పుత్రుఁడగు శృంగి వచ్చి తండ్రి మెడపైనున్న సర్పశవమును జూచి భయమంది సమీపవర్తులగు శిష్యులచే నంతయు నెఱింగి, రోషంబున

విజృంభించి మనంబున నించుకంతయుసంశయింపక "వింటికొప్పున మృతోరగంబును దెచ్చి నాతండ్రి మెడయందు వైచిన యా రాజేంద్రుఁడు నేఁటి కేడవనాఁడు తక్షక ఫణీంద్ర విషానల హేతిసంహతిం జచ్చుఁగాక"యని శపించి, తండ్రి మెడయందున్న మృతసర్పమును దీసివేసెను. పిదప శమీకుఁడు సమాధిఁజాలించి కన్నులు తెఱచి చూచి కుమారునివలన సమస్తమును విని మిగుల విచారించి యిట్లనెను. "కుమారా! ఆగ్రహముబూని రాజేంద్రు నేల శపించితివి? అతఁడు ధర్మపరుఁడై రాజ్యమును బరిపాలించుచున్నాఁడు. అతఁ డవివేకముచే నా యెడల నట్టి కార్యముఁ జేసినందుల కీ వాగ్రహింపఁ దగునే? రాజు నశించినచో రాజ్యమందుఁ జార చోరాదులు సంచరింతురు. వర్ణసంకరములు గలుగును. పరీక్షితుఁడు సామాన్యుఁడు గాఁడు. పరమ భాగవతుఁడు. భారతవంశమణి. అట్టివానికిఁ గీడుఁజేసి పాపము గట్టుకొంటివి" అని యనేక విధంబుల నాడి యా శమీకుఁడు తద్వృత్తాంతము నరపాలున కెఱింగించిరమ్మని యొక్కశిష్యునిఁ బంపెను.

మునిశిష్యుఁడరిగి పరీక్షితునకు శృంగిశాపము నెఱిఁగించెను. భూపాలుఁడు మహాదుఃఖసాగరమున మునిఁగి "అక్కటా! ఏటికి వేట కేగితిని? దప్పిఁగొని శమీకుని సన్నిధి కరిగి గాఢ సమాధియందున్న యాతనిగళంబున మృతోరగ మేల వేసితిని? దైవయోగము నెవ్వరును దప్పింపఁ జాలరు. గోబ్రాహ్మణదేవతలకుఁ గీడొనర్చిన పాపము కట్టికుడుపక యుండునా?" యని విచారించి వైరాగ్య మనస్కుఁడై రాజ్యము విసర్జించి గంగాతీరమున కేగి చిత్తంబు గోవిందపదాయత్తంబుఁ గావించి ప్రాయోపవేశంబున నుండెను. అచ్చటి కనేక మునీంద్రు లరు

దెంచిరి. పరీక్షితుఁడు వారికిఁ దన శాపమునుగూర్చి యెఱిం గించి, తనకు ముక్తిగలుగు మార్గంబుఁ జెప్పుడని పలికి జనమే జయుండను తనకుమారునకు రాజ్యాభిషేకము గావించెను. అంత మునీంద్రులందఱిలో నుత్తముఁడగు శుకమహాముని యాత నిని విలోకించి.

ఉ. ఏను మృతుండ నౌదునని♦యింతభయంబు మనంబులోపలన్
మానుము సంభవంబుగల ♦ మానవకోటికి, జావు నిత్యమౌ
గాన హరిందలంపు మిఁక ♦ గల్గదు జన్మము నీకు ధాత్రిపై
మానవనాథ! పొందెదవు♦మాధవలోకనివాస సౌఖ్యముల్.

అని వచియించి, యాతనికి భగవత్కథలఁ జెప్పఁదొడం గెను. పరీక్షితుఁడును మనంబున నన్యచింతలఁ బ్రవేశపెట్టక శ్రీహరిని దలంచుచుండెను.

అంత సప్తమదివసంబు వచ్చెను. విప్రశాపము ననుస రించి పరీక్షిద్వధార్థంబు తక్షకుఁడు బ్రాహ్మణవేషమున వచ్చు చుండెను. సర్పముచేఁ బరీక్షితుఁడు మృతినొందును గావున నాతనిని బ్రదికించి ధనము గైకొనవలయు నని కాశ్యపుఁడను మాంత్రికుఁడుగూడ వచ్చుచుండెను. ఇరువురును మార్గమధ్య మునఁ గలిసికొని తమతమ వృత్తాంతములఁ దెలిసికొనిరి. తక్ష కుఁడు కాశ్యపునకు నపరిమితధనంబిచ్చి పరీక్షిన్నికటంబునకు రాకుండఁజేసి పంపి తాను పరీక్షిన్మహారాజు చెంతకు జేరి యొక్కఫలంబిచ్చి చనెను. రాజేంద్రుఁడు దాని నాస్వాదించెను. వెంటనే యాఫలమునుండి యొక క్రిమి వెడలి, మహాకాకోదరమై పరీక్షితునిఁ గఱచెను. అంతటఁ బరీక్షితుఁడు సర్పవిషాగ్నిచే భస్మీభూతుఁ డయ్యెను. ఈ కథచే నెంతవారికి విధి యలంఘ్య మని, సత్సంగము మోక్షప్రదమని తెలియుచున్నది.

---

# ౯. ధ్రువుఁడు

హరిభక్తి యనిన సామాన్యమైనది కాదు. అది మానవునకు విజ్ఞానము, సంపదలు, నిఖిల మంగళముల నొసఁగూర్చును. భయంకరమైన సంసారసాగరము దాఁటవలయునన్న హరిసేవ యను నావ దప్ప మఱియొకమార్గము లేదు. భక్తులను రక్షించుటకు గంకణముఁ దాల్చిన శ్రీమన్నారాయణుని సేవించుటకు నందఱు నర్హులే. బాలుఁడు, వృద్ధుఁడు, కుంటి, గ్రుడ్డి యను భేదమును బాటింప బనిలేదు.

పూర్వము ఉత్తానపాదుఁ డను నొక రాజేంద్రుఁడు కలఁడు. ఆతండు ధర్మసంధుఁడై నిరంతరము ప్రజాసౌఖ్యమునే మనంబునఁ గోరుచు రాజ్యపరిపాలనము సేయుచుండెను. ఆతనికి సునీతి, సురుచి యను నిద్దఱు భార్యలు కలరు. ఆతఁడు సమస్త ధర్మములును దెలిసినవాఁడైనను మోహమును మాత్రము జయింపలేకపోయెను. చిన్నభార్యయగు సురుచియం దాతని కెక్కువ మోహము. సునీతికి ధ్రువుఁడును, సురుచికి నుత్తముఁడు నను కుమారులు గలిగిరి. ఇక్కుమారులు దినదిన ప్రవర్ధమానులై క్షపాకరుల చందమునఁ బెఱుగుచుఁ దల్లిదండ్రులకుఁ దమ బాల్యక్రీడలచే సంతోషమును గలుగఁ జేయుచుండిరి.

ఉత్తానపాదుఁడు రెండవభార్యయం దెక్కువ యనురాగముఁ గలిగి యున్నవాఁ డగుటచే నెప్పుడు నామె మందిరమందే యుండును. ఇట్లుండ నొకదినమున సురుచి గృహంబున నుత్తానపాదుఁ డుత్తముని దనయంకపీఠంబునఁ గూర్చుండబెట్టుకొని ముద్దులాడుచుండెను. ఆ సమయమున నచ్చటికి ధ్రువుఁడు

వచ్చి, యుత్తముఁడు తండ్రితొడపైఁ గూర్చుండుటఁజూచి, తానుగూడ నట్లుండుటకు సంతోషముతోఁ దండ్రిని సమీపించెను. ఉత్తానపాదుని ప్రక్క నిలిచియున్న సురుచి ధ్రువుని సంభ్రమము నెఱింగి, యడ్డమువచ్చి యక్కుమారు నీవలకు లాగి "ధ్రువుఁడా! నీవు తొందరపడవలదు. నీ సంభ్రమము నకుఁ గారణము నేను గ్రహించితిని. ఇట్టి సంతోషమునుపొందుట వలనఁ బ్రయోజనము లేదు. నీవు తండ్రి యంకపీఠమునెక్క పుణ్యమును నోచుకొని యుండలేదు. అట్టి భాగ్యమే నీకున్నచో నాకే తనయుఁడవై యుందువు. కావున నీకట్టియభీష్టమున్నచో శ్రీమన్నారాయణుని సేవింపుము. నీకాభాగ్యము తప్పక లభించును" అని పలికెను. అట్లు సురుచి పలికిన మాటలను విని యుత్తానపాదుఁ డూరకుండెను గాని వారింపలేదు. ధ్రువుఁడు బాలుఁడైనను సవతితల్లియాడు వాక్యము లాతని హృదయమును దహించి వేసెను. అందులో నాతఁడు క్షత్రియపుత్రుఁడు. ఆ పరాభవమును సహింపలేకపోయెను. ఆతని కన్నులనుండి జలము ప్రవాహముగతిఁ బాఱఁదొడఁగెను. మహాదుఃఖ సముద్రమున మునింగెను. "సవతితల్లి యట్లు చేసినఁ జేయుగాక! తండ్రి యందులకు సహించియుండె" నని యాతఁడు మఱింత యేడ్చెను.

సురుచిచేఁ బరాభవింపఁబడి వెక్కి వెక్కి యేడ్చుచు ధ్రువుఁడు కన్నతల్లియగు సునీతిం జేరెను. సునీతి కుమారుని అంకమునఁ గూర్చుండఁ బెట్టుకొని, చిక్కుపడ్డ కురులు చేత దువ్వుచు దుఃఖమునకుఁ గారణమడిగెను. ధ్రువుఁడు సమస్తము వినిపించెను. తన సవతివలన నిజకుమారునకుఁ జరిగిన పరాభవముఁ దలంచి యామెగూడ వగచి, కొంత సేపటికి

ధైర్యమవలంబించి, ధ్రువుని విలోకించి యిట్లనెను. "నాయనా! నీవు చింతించినందువలనఁ బ్రయోజనములేదు. లోకమున, బ్రతి మానవుఁడును కర్మబద్ధుఁడై యుండును. ఆ కర్మను దాటుట కెవ్వరును శక్తులుగారు. నిన్నుఁ జూచిన నాకును జింత కలుగుచున్నది. కాని నేనుగూడ నేమియుఁ జేయ జాలను. మీతండ్రిచేత నేను దాసికంటెను గడు నీచముగఁ జూడఁబడు చున్నాను. దురదృష్టవంతురాల నగు నాకు జనించుటచేత నీవిట్టి పరాభవమును బొందితివి. ఈ విషయ మట్లుంచుము. నందనా! సురుచి పలుకులలో నసత్య మేమియును లేదు. ఆమె వచించినట్లు నీవు శ్రీహరిపదముల నాశ్రయింపుము. సమస్త శుభములును గలుగును. చతుర్ముఖుని యంతటివాఁ డతనిం గొలుచుటచేతనే సృష్టికార్యమును జేయుటకు సమర్థుఁడై యున్నాఁడు. భగవంతుఁ డగు శ్రీమన్నారాయణుఁడుతప్ప నీ చింతఁ బాపుట కెవ్వరును జాలరు.

ధ్రువుఁడు శోకమును విడిచి, ధైర్యము వహించి, తల్లి మాటలు విని, శ్రీహరినిగూర్చి తపము సేయఁదలచి యామె యనుజ్ఞఁబొంది, నగరమువిడిచి యడవిత్రోవంబట్టి పోవు చుండెను. త్రోవయం దాతనికి నారదమునీంద్రుఁడు కనిపించెను. నారదుఁడు ధ్రువుని వృత్తాంతం బంతయు యోగదృష్టిని గ్రహించెను. ధ్రువున కాతఁడెవ్వరో తెలియకపోయినను భక్తిపూర్వకముగ నాతని పాదములకు నమస్కరించెను. నారదుఁ డాతని గుణములకు సంతసించి సాహసమున కద్భుత మంది యాతని శిరమును దనఫాలముచే స్పృశించి, "కుమారా! నీసంగతి నంతయు నేను గ్రహించినాను. నీతండ్రి రాజాధి రాజు. మీ మందిరము లక్ష్మీనిలయము; భాగ్యభోగ్యములకు

లోపములేదు. నీవు బాల్యవయస్కుఁడవు. మానాభిమానము-లతో నవసరములేదు. ఇట్టివి పురాకృతకర్మము ననుసరించి మానవులకుఁ గలుగుచుండును. కష్టసుఖములు దినకర్మము ననుసరించి వచ్చుచుండు నని యుత్తమజ్ఞాని తలంచుచుండును. నీవు శ్రీహరినిఁ గూర్చి తపమునకుఁ బోవుచుంటివి. తపస్సుఁ జేయుట యనఁగా నేమని భావించితివో నాకుఁ దెలియకున్నది. అనేకవేల వత్సరములు పరమనిష్ఠా గరిష్ఠులై తపముఁజేసిన మహాయోగులే యాతనిని జూడఁజాలక యుందురు. అట్టిచోఁ బాలుఁడవగు నీ వెంత ? కావున నీవు నా మాటవిని యిట్టి యుద్యమమునుండి నీ బుద్ధిని మరలించుకొని గృహమున కరిగి సుఖంపుము'' అనియెను.

నారదుని వాక్యములకు ధ్రువుఁడు సమ్మతింపలేదు. నారదుఁడు మరల ననేకవిధములఁ జెప్పెను. ఎంత చెప్పినను హరిపైఁ జేర్చిన తనచిత్తమును ధ్రువుఁడు మరలించుకొనఁ దలఁపలేదు. ఆ కుమారుఁడు మునీంద్రునిగాంచి ''మహాత్మా ! నేను రాజపుత్రుఁడను; పౌరుషాభిమానములు మాకులీనుల కుగ్గుపాలతోఁ బెట్టఁబడును. ఇట్టివానికి వయస్సుతోఁబనిలేదు. నేను శ్రీహరికై ఘోరమైన తపస్సుఁ జేయుదును. ఇదియే నా దృఢసంకల్పము. ఎన్ని యంతరాయములు వచ్చినను నిందు లకు నాచిత్త మన్యథా వర్తింపదు. దేవా! నీవు బ్రహ్మమానస పుత్రుఁడవు. నీకు దెలియని విషయములీ పదునాల్గు లోకముల యందునను లేవు. నాయందుఁ గృపాసముద్రుఁడవై, యేతెఱఁగునఁ దపముఁజేసిన శ్రీహరి సాక్షాత్కారము వడయఁ గలుగుదునో యట్టిది తెలిపి, నన్ను కృతార్థునిఁ జేయుము. నీ కనేక వేల వందనములు సేయుదు'' నని దీనుఁడై పలికెను. ధ్రువుని

మాటలకు నారదుఁడు మిగుల సంతసించి యిఁక నాతని చిత్తము తిరుగదని నిశ్చయించి, యక్కుమారున కిట్లనెను. "ధ్రువుఁడా! మనము దేనికిని కర్తలముకాము. సకలము భగవదధీనమై యుండును. తపస్సుఁ జేయవలయునని నీకు సంకల్పము గలిగించినవాఁడు భగవంతుఁడే యని తలంపుము. భగవంతుఁడగు శ్రీమన్నారాయణుఁడు లోకమునం దంతటను నిండియున్నాడు. ఆతఁడు లేని స్థలమే లేదు. విజ్ఞానము, మోక్షము మొదలగు వానిని బడయ దలఁచినవాఁడా మహాత్ముని సేవించితీరవలయును. తపస్సునకు దగిన నిర్మలమైన ప్రదేశ ముండవలయును. యమునాతీరమున మధువన మున్నది. అది తపస్సునకుఁ దగిన దివ్యప్రదేశము. భగవ దర్చనకుఁ గావలసిన వివిధ పుష్పము లుండును. ఆఁకలి దీర్చుకొనుటకు మంచి ఫలవృక్షము లున్నవి. విమల సలిలము లుండును. ఇఁకఁ గావలసిన వేమున్నవి? కుమారా! నీవు బాలుఁడ వగుటచే నియమములతో బనిలేదు. ఆతనిని నిశ్చలమైన భక్తితోఁ గొలువుము." ఇట్లు పలికి యక్కుమారుని యెడలఁ గరుణవహించి యాతనికా నారదుఁ డిరువదియేడు దినములు జపము దీక్షతోఁ జేసినచో ఖేచరులనైనఁ జూచుటకు శక్తికలుగు వాసుదేవ మంత్రము నుపదేశించెను. ధ్రువుఁ డా మునీంద్రునకు నమస్కరించి మధువన మార్గమును బట్టి చనెను.

ఇక్కడ నగరమున ధ్రువుఁ డెచ్చటికో యెవ్వరికిని దెలియకుండ నరిగినాడని యుత్తానపాదుఁడు విని చింతఁ బొందుచుండెను. ధ్రువుఁడు నగరమునుండి వెడలిన నాఁటనుండియు నాతఁడు నిద్రాహారములకుఁ దూరుఁ డయ్యెను. నానాటికి శరీరముకృశించు చుండెను. రాజకార్యము లన్నియు

మఱచియుండెను. ఎప్పుడుఁ జూచినను ధ్రువుని గూర్చిన చింతయే పొందుచుండెను. ఇట్లుండ నారదుండరుదెంచి ధ్రువుని సేమము నెఱింగించి యాతనికిఁ గొంత ధైర్యము కలుగఁ జేసెను.

## —♦ తపస్సు - శ్రీహరి సాక్షాత్కారము ♦—

నారద ప్రబోధితుఁడైన ధ్రువుఁడు మధువనమును ప్రవేశించెను. అచ్చట యమునయం దాతఁడు స్నానమాచరించి నిశ్చలచిత్తుఁడై శ్రీమన్నారాయణుని గూర్చి ఘోరమైన తపస్సుఁ జేయఁదొడంగెను. ఆతఁడు కఠినదీక్ష వహించెను. కొన్ని దినములు ఫలముల దినుచు, కొన్ని దినములు కేవల ముదకమునే త్రావుచు, మఱికొన్ని దినములు నిరాహారుఁ డగుచు నైదుమాసములు తపస్సుఁ జేసెను. ఆతని తపమునకు దేవతలందఱును భయమంది శ్రీహరి సన్నిధికేగిరి. శ్రీహరి వారింగాంచి "ధ్రువుఁడు నాకొఱకుఁ దపము సేయుచున్నాఁడు. నేనిప్పుడే యఱిగి వానికి సాక్షాత్కరించి తపము వారించెద" నని పలికి వారిం బంపివేసి తాను గరుడవాహనారూఢుఁడై ధ్రువుఁడు తపము సేయుచున్న మధువనంబునకు వచ్చెను. అప్పుడు ధ్రువుఁ డేకాంగుష్ఠముమీఁద నిలిచి తపము సేయుచుండెను. లక్ష్మీకళత్రుఁడతనియెదుట నిలిచియుండెను. ధ్రువుఁడు కన్నులు తెఱచి చూచి యపూర్వ తేజమునకు విభ్రమమంది భగవంతుఁడు తన్ననుగ్రహించుటకు విచ్చేసెఁ గాఁబోలునని తలంచి, యానందబాష్పముల విడుచుచు నా దేవదేవుని పాదములపైఁ బడెను. ఆతఁడు బాలుఁ డగుటచే నా భగవంతుని నేవిధమున స్తుతింపవలయునో తెలియలేదు. శ్రీహరి యా-

కుమారుని భావంబెఱింగి తనహస్తముచే నాతని శిరము స్పృశించెను. అంతట ధ్రువుఁడు దివ్యజ్ఞానముచేఁ బూరింపఁబడిన చిత్తము గలవాఁడయ్యెను. నూతనవికాస మా బాలుని మొగముపైఁ గనుపట్టెను. అపూర్వతేజశ్శాలి యయ్యెను. శరీరమునకుఁ గాంతియు బలమును వచ్చెను.

అంతట నాతఁడు శ్రీమన్నారాయణునకుమరల నమస్కరించి ముకుళిత కరకమలుఁడై యిట్లనెను. "దేవా! సకలజీవులకును నీ వాధారుఁడవు. బాలుఁడనై నను నీకొఱకు దపముఁ జేసిన నన్ననుగ్రహించుటకుఁ గృపఁబూని వచ్చితివి. నన్ను రక్షింపుము. లోకపరిపాలనమున కీవనేకరూపంబులఁ దాల్చుచుందువు. స్వామీ! నిన్నాశ్రయించి సంసారసాగరముఁదరింపఁ దలంచితిని. తండ్రీ! నాకు నీవేదిక్కని నమ్మియున్నాను. నిన్నాశ్రయించిన సద్భక్తుల కెట్టి సుగతి నిచ్చెదవో యదియే నాకుఁ బ్రసాదింపుము. ప్రతాప పౌరుషబలములు నీ చిత్తమును రంజింపఁ జేయజాలవు. నిశ్చలచిత్తములేని బ్రాహ్మణునికంటె నిశ్చలచిత్తముతో నిన్ను భజించి నీయనుగ్రహమునకు బాత్రుఁడయిన చండాలుఁడు పూజనీయుఁ డగును. నారదోపదేశమున నిన్ను సేవించితిని. నీ దివ్యస్వరూపమును జూచినాఁడ. నా పాపంబులెల్లఁ బాసినవి. దేవా! నేను బాలుఁడను. సవతితల్లి యగు సురుచివాక్యము లగ్నికీలలవలె నా హృదయమును దహించుటచే నిట్లు వచ్చి నిన్నాశ్రయించినందులకు నన్ను గరుణించి నీ దర్శనం బొసంగితివి. కృతార్థుఁడ నయితిని."

ధ్రువుని భక్తికిని నాతని వాక్యములకును భగవంతుఁ డానందము నొందెను. ఆతఁ డక్కుమారుని విలోకించి యిట్లు

నెను. "కుమారా! మహాయోగీంద్రులకైనను దుర్లభుండ నయిన నన్ను నీ దృఢశక్తిచే వశము జేసికొంటివి. నీవలె నన్నెవరును వశము సేయలేరు. నా యనుగ్రహమున నీవు మహోన్నతమైన దివ్యపదము నందఁగలవు. ఇరువదియారువేల వత్సరములు చనినపిమ్మట నట్టిది నీకు లభించును. ప్రళయసమయమునందు గూడ నీ పదమునకు నాశనముండదు. నీజనకుఁడు కొన్నాళ్లకు రాజ్యమునిడిచి వనంబుల కరుగును. నీ తమ్ముఁడగు నుత్తముఁడు మృతినొందును. సురుచికూడ తనయునిపై బెంగచే మరణించును" అనిచెప్పి మరల నిట్లుపలికెను. "ధ్రువా! నీవు నాకుఁ గడుఁగూర్చు భక్తుండవు. నీవు రాజ్యమేలునప్పుడు నన్నుఁగూర్చి క్రతువులు సేయుము. బ్రాహ్మణులను దృప్తిపఱచుము. కావలసిన సౌఖ్యభోగముల ననుభవింపుము. ఎవ్వరును బొందని దివ్యపదము నీవందెదవు." ఇట్లు చెప్పి శ్రీమన్నారాయణుఁడు నిజలోకమున కరిగెను. అనంతరము ధ్రువుఁడు శ్రీహరికరుణఁ గాంచితినని సంతోషమును బొందుచు నిజపురాభిముఖుఁడై వచ్చుచుండెను. ఈతఁడు వచ్చుచుండుట చారులు కొందఱు చూచి నారదుని వాక్యములపైఁ గొంత ధైర్యము వహించి, నందనుఁ డెప్పుడు వచ్చునా యని గడియ యొక యుగముగ గడుపుచున్న యుత్తానపాదుని కడకు వచ్చి ధ్రువుఁడు వచ్చుచున్నాఁడని తెలిపిరి. రాజేంద్రుఁడు సంతోషమంది యా చారులకు బహుమానమిచ్చి భార్యాదులతోడను, మంత్రిపురోహితులతోడను ధ్రువున కెదురేగెను. ధ్రువుఁడు వీరందఱినిఁ బురసమీపమున నున్న వనంబునఁ గాంచెను. ఉత్తానపాదుఁడు ధ్రువునిఁ గౌఁగిలించుకొని ముద్దుపెట్టుకొనెను. సునీతి యానందమునకు మేరలేదు. ధ్రువుఁడు తండ్రికిని తల్లుల

కును నమస్కరించి, యుత్తముని గౌఁగిలించుకొనెను. సురుచి ధ్రువుని యపూర్వ తేజమును జూచి పూర్వము తానన్నమాట మఱచి "హరికరుణ నందినవారి కెట్టి కొఱంతయు నుండ" దని పలికి యక్కుమారుని దీవించెను. పిమ్మట వారా ధ్రువుని గజారూఢునిఁజేసి మంగళ వాద్యములతోఁ బురమునకుఁ దోడ్కొని వచ్చిరి.

## —♦ రాజ్యపరిపాలన ♦—

ఉత్తానపాదుఁడు తన యిరువురు కొడుకులఁ జూచి యానందించుచుఁ గొన్నాళ్ళుండి, యుక్తవయస్కుఁ డయిన ధ్రువునకుఁ బట్టాభిషేకమును జేసి, తాను తపోవృత్తినుండుటకు వనంబునకు బోయెను. ధ్రువుఁడు రాజయ్యెను. ఆతఁడు సత్య ధర్మములు దప్పకుండఁ బ్రజలను గన్నబిడ్డలవలెఁ జూచుచు రాజ్యమేలుచుండెను. ఈతఁ డిరువురు కాంతలం బెండ్లియాడి వారియందు ముగ్వురు పుత్రులను, నొక్క పుత్రికను గాంచెను.

ధ్రువుని తమ్ముఁడగు నుత్తముఁడు వివాహము గాక పూర్వమే హిమాలయ ప్రాంతమున నొక యక్షునిచేఁ గూలెను. కుమారునిపై బెంగచే సురుచి వాని మార్గము ననుసరించెను. ధ్రువుఁ డుత్తముని మృతికి మిగుల వగచి యక్షులపై బగఁదీర్చుకొనఁ దలఁచి బాణపాణియై దివ్యరథమెక్కి బయలువెడలి హిమవత్పర్వతము చేరువను యక్షుల నివాసమగు నలకాపురి సమీపమున నిలిచి వారిని రణమున కాహ్వానించుచు శంఖము పూరించెను. యక్షులందఱును వచ్చి ధ్రువుని మార్కొనిరి. ఆతఁ డావంతయు భయమందలేదు. రణరంగమున కాలరుద్రుని లీల జెలంగుచు నందఱ కన్నివిధముల వివిధ నారాచ పరంపర

లతోఁ బ్రత్యుత్తర మిచ్చెను. యక్షు లనేక మాయలు సేయు చుండఁ దుదకు ధ్రువుఁడు నారాయణాస్త్రమును బ్రయోగించెను. అప్పుడు స్వాయంభువమనువు వచ్చి ధ్రువుని శాంతచిత్తునిగాఁ జేసి యక్షేశ్వరుండగు కుబేరునితో సఖ్యముఁ జేసెను. పిదప నాతఁడు నిజపురమున కరిగెను.

## ధ్రువమండలము

శ్రీహరికిఁ బ్రీతిగ ధ్రువుఁ డనేక యాగములుఁ జేసి, యశమంది తుద కిహలోక సౌఖ్యములను వర్జించి కుమారు నకుఁ బట్టముగట్టి తపముఁ జేసికొనుటకు బదరికావనమునకుఁ బోయెను. ఆతఁడచ్చటఁ దపము సేయుచుండ నొకదివ్యవిమానమువచ్చి యాతనియెదుట నిలిచెను. విమాన నిర్వాహకులు విష్ణుకింకరులని గ్రహించి ధ్రువుఁడు వారలకు నమస్కరించెను. వారు ధ్రువుని విలోకించి "నృపాలా! మేము విష్ణుదాసులము. నీవు బాల్యమునచేసినఁ దపస్సునకు శ్రీమన్నారాయణుఁడు మెచ్చి, నిన్నుఁ దోడ్కొని రమ్మని మమ్ముఁ బంపినాడు. ఈ విమానమెక్కు" మనిరి. శ్రీహరికరుణచే ధ్రువుఁడు హిరణ్మయరూపముఁ దాల్చి భూతలముననున్న తనతల్లిం దలఁచుకొని విచారింప విష్ణుకింకరు లాతనిభావంబెఱింగి నీతల్లి గూడ స్వర్గమునకు వచ్చుచున్నదని తెలిపిరి. ధ్రువుఁడు విమానారూఢుఁడై గ్రహమండలమును, త్రిలోకములను, సప్తముని మండలమును దాఁటి శ్రీహరిచే నొసంగఁబడిన మహోన్నతమైన దివ్యపదము నందెను. అదియే ధ్రువమండలము. ఆహా! దైవభక్తి యెంతటి మహాత్కార్యమైనను సులభసాధ్యముగ నొనర్పఁ గలదనుట కిదియే తార్కాణము.

# ౧౦. నారదుఁడు

శ్రీహరిని సేవించుటకుఁ గులముతోఁ బనిలేదు. చండాలుఁడయినను నిష్కళంకమయిన హృదయముతో, నిర్మల జ్ఞాన సంపత్తితో, నిశ్చలభక్తితో శ్రీమన్నారాయణుని సేవించి యాతని యనుగ్రహమునకుఁ బాత్రుఁడయినచోఁ బూజనీయుఁడని చెప్పుటకు సంశయము లేదు.

నారదుఁడొక బ్రాహ్మణునియింటనుండు దాసికిఁ బుత్రుఁడు. ఒక సమయమున నా బ్రాహ్మణుని యింటికి గొందఱు యోగులు వచ్చి వర్షాకాలమంతయు నచ్చటఁ గడుపఁదలఁచి యుండిరి. అప్పుడీ నారదుఁడు బ్రాహ్మణునిచే నాయోగులకు సపర్యలు సేయుటకు నియమింపఁబడెను. నారదుఁడు చిన్నవాఁడయినను నసత్యముఁ జెప్పకయుండుట, పెద్దలయందు భక్తి, శాంతము మొదలగు సద్గుణములన్నియు నాతనియందు మూర్తీభవించి యుండెను. పరిచర్యకు బ్రాహ్మణునిచే నియమింపబడిన యాతఁడు యోగులను నెంతయోభక్తితో సేవించుచు వారి చిత్తముల రంజిల్లఁ బ్రవర్తించుచుండెను. అసహ్యమనక మహాప్రసాదమని భావించి, యాతఁడాయోగుల యుచ్ఛిష్టమును గూడ దినుచుండెను. యోగులు హరినామ సంకీర్తనము సేయునప్పు డీతఁడు మిగుల శ్రద్ధతో వినుచు దానుగూడ దన చిత్తమును హరియందుఁ జేర్చి పారవశ్యమును బొందుచుండెను. ఇట్లుండ గొన్నాళ్ళకు వర్షము లాగిపోయినవి. ఆ యతీశ్వరు లాగ్రామమునుండి పోవుటకు సంసిద్ధులైయుండి నారదునియెడల దయగలవారై యాతనికి శ్రీహరిని సేవింపవలసిన విధానమును జెప్పి చనిరి. యోగుల యుపదేశమును బొందిన నారద

దునకు మంచిజ్ఞానముకలిగెను. శ్రీమన్నారాయణుని మనంబున నిలిపెను. శ్రీహరికంటె నితరదైవము లేఁడని యాతఁడు దృఢముగా నమ్మెను. ఆతఁడు నిరంతరముభగవంతుని సేవించు చుండియుఁ, దన యజమాని చెప్పెడు పనులను మిగులశ్రద్ధతోఁ జేయుచుండెను. తల్లికినారదుఁ డేకపుత్రుఁడు. స్థితికి పేదయైనను, ప్రేమకుఁ బేదఱికములేదుకదా! ఈతనియందుఁ దల్లికి ప్రేమ యధికమై యుండెను. ఒక్కొక్కనాఁడు బ్రాహ్మణునియింటఁ దీర్పవలసిన కృత్యము లాలస్యమైనప్పుడు నారదుఁడు రాత్రి సమయమున గృహమునకుఁబోవు వాడుక కలదు. అట్టిసమయ మునఁ దల్లి వానికెదురేగి "నాయనా! వచ్చితివా! ఆఁకొంటివి కాబోలు, రమ్ము" అని కౌఁగిలించు కొనుచుండును. నారదుఁడు మాత్రము జ్ఞానము నార్జించి యుండుటచే మాయావ్యామో హమునఁ బడకయుండెను. ఇట్లనేకదినములు గడచెను.

ఒకనాఁటి సంధ్యాసమయమున నారదునితల్లి క్షీర ములఁ బిదుకుటకు గోవుదగ్గఱకుఁ బోవుచుండఁగా విధివశంబున సర్పదష్టయై ప్రాణములు విడిచెను. తల్లి మరణముగాంచి నార దుఁడు దుఃఖపూరితమానసుఁడు గాక భగవంతుఁ డీ విధంబునఁ దన్ననుగ్రహించె నని తలంచి, ధైర్యము వహించి యామెకుఁ బ్రేతకార్యములు నిర్వర్తించి, తపస్సుఁజేయుట కొక మహారణ్య మునకు బోయెను. అచ్చట వృక్షముక్రింద నాసీనుఁడై మనం బును శ్రీహరిపై నిలిపి చింతింపుచుండ నాతనికొక దివ్య తేజము కనఁబడెను. కాని యది యంతలో మాయమయ్యెను. ఆతఁడందులకు విభ్రాంతినంది చూచుచుండ నిర్జనంబైన యవ్వన ములో "నారదా! నీవు విచారింపవలదు. నన్నీ భవంబున

నీవు చూడఁజాలవు. నీ యభీష్టము దీరునని సూచించుటకు నా తేజము కొంచెము నీకుఁ జూపితిని. మదీయ సేవారతి నీకు వ్యర్థముకాదు. నీవు నన్ను రాఁబోవు జన్మమున వీక్షింప గలవు. నాకరుణకుఁ బాత్రుఁడవగుదువు. నాభక్తులలో నగ్రగణ్యుఁడ వగుదువు'' అను పలుకులు వినవచ్చెను.

ఈ పలుకు లతఁడు విని సంతోషమునంది శ్రీహరిం గూర్చి ఘోరమైన తపస్సుజేయుచుఁ గాలమునకై నిరీక్షించు చుండెను. అటుండఁ గొంతకాలమున కాతఁడు మరణించి, మరల బ్రహ్మదేవుని తేజమువలన జననమంది, నారదుఁ డను మునీంద్రుఁడై శ్రీమన్నారాయణుని యనుగ్రహమునకుఁ బాత్రుఁడై నిరంతరము హరింగీర్తించుచు త్రిలోకములయందుఁ జరించుచుండెను. ఆహా! భగవద్భక్తులగు సాధుజనుల కృపచేఁ గదా నారదుఁడిట్టి ప్రసిద్ధిఁ బడసినది.

---

# ౧౧. గజేంద్రమోక్షము

సీ. కలుగఁడే నాపాలి ♦ కలిమి సందేహింప
గలిమిలేములు లేక ♦ కలుగు వాఁడు
నా కడ్డపడరాఁడె ♦ నలిన సాధువులచే
బడినసాధుల కడ్డ ♦ పడెడు వాఁడు
చూడఁడే నాపాటుఁ ♦ జూపులఁ జూడక
చూచువారలఁ గృపఁ ♦ జూచువాఁడు
లీలతో నామొఱా ♦ లింపఁడే మొఱఁగుల
మొఱలెఱుంగుచు దన్ను ♦ మొఱఁగువాఁడు

తే. అఖిలరూపులు దనరూప ♦ మైనవాఁడు
ఆదిమధ్యాంతములు లేక ♦ యలరువాఁడు
భ క్తజనముల దీనుల ♦ పాలివాఁడు
వినఁడె చూడఁడె తలఁపడే ♦ వేగరాఁడె."

త్రికూటాచలంబను పేర నొప్పు నొక పర్వతరాజము కలదు. ఆ పర్వతముమీఁద కనుదినంబును గంధర్వాదులు విహరించుటకు వచ్చుచుందురు. దాని సమీపమున ననేకారణ్యములు, సెలయేళ్ళు మొదలగునవి సౌందర్యముగ గనఁబడుచుండును. ప్రకృతిశోభఁ జూడవలయు నన్న నా ప్రదేశముననే చూడవలయును. అచ్చటనున్న యొక మహారణ్యమునఁ గల యేనుఁగు లన్నియు నొకనాఁడు గుంపులు గుంపులుగాఁ జేరి విహారమునకు బయలుదేఱెను. ఆ యేనుఁగు లన్నియు దారియందున్న వృక్షముల కొమ్మలను దమ తొండములచే విఱుచుచు, వృక్షములనుబట్టి పెల్లగించుచు, నొకదాని నోటినుండి మరియొకదాని కందిచ్చుచు, చిత్ర విచిత్ర గతులఁ బోవుచుండెను. ఇట్లు వచ్చినప్పు డొక కరీంద్రము తనతో వచ్చుచున్న గజములనువిడిచి దారిదప్పి కొన్ని యేనుఁగులతో మఱియొక మార్గమునుబట్టి చనెను. ఇట్లు చనిచని యాగజం బరణ్యామంతయు గ్రుమ్మరి, దప్పినొంది యాప్రాంతముననున్న యొక యగాధమైన మడుంగునుజేరి యందు బ్రవేశించి సలిలంబుల గడుపారఁ గ్రోలి మీన మకరసంతతి భయమందునట్లు తొండమున నీరంబులుఁ బూర్తిగఁ బూరించి విడుచుచు, నాసరోవరమెల్లఁ గలఁచివేయుచుండెను. అపుడు గ్రాహం బొకటి వచ్చి కరీంద్రుని పాదమునుబట్టి బంధించెను.

గజమెంత బలముగలది యయినను జలంబులలోనున్న మకరిమెదుట నదియంతయు వ్యర్థమయ్యెను. కాని యయ్యది ధైర్యమును విడువక మొసలిని దనదంతములచేఁ బొడిచెను. తొండముచేఁ గొట్టెను. తన శక్తి మకరిమెడలఁ బూర్తిగ నుపయోగించెను. ప్రయోజనము లేకపోయెను. నీరాట వనాటములపోరాట మధికమయ్యెను. రెండును బౌరుషంబున విజృంభించి రాత్రింబవళ్ళం దెలియక పట్టువిడువక పోరాడుచుండెను. గంధేభేంద్రుని బల మంతకంతకుఁ దగ్గదొడఁగెను. మిగుల డస్సెను. తుదకుఁ దనకు మకరివలన మృతిగూడ సంభవించునని యధైర్యమునంది "అక్కటా! అనేక గజంబులు గొలువ నరణ్యంబునఁ జరించు నేను నేఁడీ జలజాకరంబున కేలవచ్చితిని? ఈ మకరిచే నేల పట్టుఁ బడితిని? ఇప్పుడు నన్నెవరు రక్షింపఁ గలరు? ఎవ్వరిని వేఁడుకొందును? ఎవ్వరు నాభయంబు నుడిపెదరు? తుదకు నాస్థితి యిట్లయ్యెగదా!" యని మిగులఁ జింతించి, యట్టి విపత్సమయమునఁ దన్ను రక్షించుట కొక్క శ్రీమన్నారాయణుఁడు తప్ప నితరులు లేరని నిశ్చయించుకొని,

"ఉ. ఎవ్వనిచే జనించు జగ ♦ మెవ్వనిలోపల నుండు లీనమై
యెవ్వనియందుడిందుఁ♦బరమేశ్వరుఁడెవ్వఁడు మూలకారణం
బెవ్వఁ డనాదిమధ్యలయుఁ♦డెవ్వఁడు సర్వము దానయైనవాఁ
డెవ్వఁడు వాని నాత్మభవు ♦ నీశ్వరు నే శరణంబువేడెదన్

సకలార్థసాక్షియు, నకలంకుఁడునగు నమ్మహాత్మునిఁ దలంతును. సర్వలోకంబులు నశించినను నేకాకృతి నెవ్వఁడు వెలుంగునో వానిని సేవింతును. మునులును దివిజులును నెవ్వని వర్తనంబు నెఱుంగఁజాలరో, యట్టి జగన్నాటక సూత్రధారిని

భజింతును. ముక్తసంగులయిన మునులెవ్వని గొల్చుచు దివ్యపదంబుల నందుచుందురో యట్టి దేవదేవుఁడు నాకు దిక్కగును. నేనామహాత్ముని సేవించినచో నన్నేల రక్షింపక యుండును? భక్తరక్షణదీక్షాబద్ధకంకణుఁడగు నాతఁడు నన్నేల యుపేక్షించును?" అని తలంచి, తన చిత్తంబు శ్రీహరిపై నిలిపి యిట్లు వేడుకొనెను.

"శా. లావొక్కింతయులేదు ధైర్యము విలో
లంబయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చెఁ దనువున్
డస్సెన్ శ్రమం బయ్యెడిన్
నీవేతప్ప నితఃపరం బెఱుఁగ
మన్నింపందగున్ దీనునిన్
రావే యీశ్వర! కావవే వరద! సం
రక్షింపు భద్రాత్మకా!"

కరి తన్ను మొఱపెట్టుకొనుచున్న సమయంబున శ్రీమన్నారాయణుఁడు రమాదేవితో వైకుంఠపురంబున నిజసౌధంబున బర్యంకమధ్యంబున వినోద సంభాషణమున మునిగి యుండెను. గజేంద్రుని మొఱ తన శ్రవణరంధ్రములయందుఁ బ్రవేశించినయంతనే యా లక్ష్మీదేవితో సంభాషణము నాపివేసి కడుఁరయమునఁ దల్పము దిగెను.

లక్ష్మీదేవికిఁ జెప్పలేదు. శంఖచక్రములఁ బట్టలేదు. పరివారమునుఁ బిలువలేదు. గరుడునిఁ దలంపలేదు. వెంటనే వైకుంఠము విడిచి బయలుదేఱెను. అమ్మహాత్ముఁ డెక్కడి కే కార్యముపై నరుగుచుండెనో యెవ్వరికిని దెలియదు. శ్రీహరి

వెనుక నిందిరయు, గరుడుఁడు మొదలగువారందఱు నరిగిరి. మార్గమధ్యమున లక్ష్మీదేవి తనమనంబున "ఈతఁ డెచ్చటికిఁ బోవుచుండెను? దేవతానగరిపై కెవ్వారైన దానవులు దండెత్తి వచ్చిరా? నిగమంబుల నెవ్వారైన దస్కరించిరా? భగవంతుం డగు హరినిఁ జూపింపుఁడని భక్తులను బట్టుకొని యేఖలులైన బాధించుచుండిరా? ఏభక్తుఁడయిన విపత్సాగరంబున మునిఁగి తన్నుద్ధరింపుమని యీ కరుణాసాగరుని వేఁడుకొనెనా?" యని పరిపరివిధముల నాలోచించుచుండెను. వియత్పథంబున శ్రీహరి పోవునప్పు డెదురైన దేవత లాతనికి నమస్కరించిరి. గజప్రాణావనోత్సాహమునఁ దొందరగాఁ బోవుచున్న యాతఁడు వారి నమస్కారము లయినను గైకొనలేదు. ఆతఁడు కడుశీఘ్రగతిని దిన్నగా వేదండగ్రాహంబులు పోరాడు ప్రదేశమునకుఁ బోయి చక్రమును దలంచెను. వెంటనే చక్రమువచ్చి యాతని హస్తమునఁ జేరెను. అంతట నాతఁ డాచక్రమును గ్రాహముపై బ్రయోగింప నయ్యది నీటం బ్రవేశించి మకరిశిరంబును ద్రుంచెను. అనంతరము కరుణామయుఁడగు భగవంతుఁడు గజేంద్రుని మడుంగునుండి వెడలఁదిగిచి తనహస్తముచే నాతని శరీరమును స్పృశించెను. గజం బాయాసమును, సంతాపమును వాసి, విష్ణుకరస్పర్శంబున సంతోషమంది ఘీంకారరవముఁ జేసెను. ఆహా! శ్రీహరి ఆర్తత్రాణపరాయణుఁడను బిరుదము ఇందుచేఁగదా రూఢమైనది.

---

# ౧౨. కుచేలుఁడు

"మ. కలలోనం దను మున్నెఱుంగని మహా
కష్టాత్ముఁడై నట్టి దు
ర్బలుఁ డాపత్సమయంబునన్ నిజపదా
బ్జాతంబు లుల్లంబులోఁ
దలపన్ దోడనె మెచ్చి యార్తిహరుఁడై
తన్నైన నిచ్చున్ సువి
శ్చలభక్తిన్ భజియించువారి కిడఁడే
సంపద్విశేషోన్నతుల్."

దారిద్ర్య మనునది యష్టకష్టములలో నొక్కటిగాఁ జెప్పఁబడినది. ఎట్టిబాధనయినఁ బొందవచ్చునుగాని దారిద్ర్య బాధఁబొందుట మాత్రము మిగుల కష్టము. పూర్వము విజితేంద్రియుఁడును, రాగరహితుఁడును, శాంతుఁడును, ధర్మవత్సలుఁడును, బ్రహ్మవేత్తయునగు కుచేలుఁడను బ్రాహ్మణుఁడొకఁడు కలఁడు. ఆతఁడు మహాదరిద్రుఁడు. అట్లుండియు గార్హస్థ్యావృత్తి నొరుల నడుగఁబోవక తనకు లభించినదానితోఁ దృప్తిఁ బొందుచుఁ బుత్రదారాభిరక్ష యొకవిధమున నడపుచుఁ గాలముఁ గడుపుచుండెను. ఆతని భార్యయు నతని కనుగుణముగా వర్తించు పరమసాధ్వి. దరిద్రుఁడయిన కుచేలునకు సంతాన మెక్కువగ నుండెను. తల్లిదండ్రుల దారిద్ర్యస్థితి పసిబిడ్డల కేమి తెలియును? శిశువులు తల్లిం జేరి మాకిది కావలె నదికావలె నని నిరంతరము పోరుబెట్టి యేడ్చుచుండిరి. పాపమామె యేమి చేయఁగలదు? దుస్సహదారిద్ర్య పీడచేఁ గడునొచ్చి, మిగుల వగచి యామె యొకనాఁడు నాథుండగు కుచేలునిఁ జేరి

"మహాత్మా! మన పేదఱికము వాయుట కుపాయ మెద్దియు నూహింపవైతివికదా! ద్వారకాపురాధీశ్వరుండగు కృష్ణుఁడు నీకు బాల్యసఖుండని నీవు మున్నెన్నిమారులో నాకుఁ జెప్పియుంటివి. నీ వాతని సన్నిధికిఁ బోతివేని దారిద్ర్యాంధకార మగ్నులమైయున్న మనకా వాసుదేవుని కృపాకటాక్షము రవిదీప్తిగాకయుండునా? ఆ నందనందనుఁడు సాధుభక్తజనవత్సలుఁడు, ఆర్తశరణ్యుఁడు, కృపాపయోధి; నీ వాతనిం జూచితివేని సంపదల ననుగ్రహించు" నని పలికెను. భార్య చెప్పిన పలుకులు విని, యెట్లయినను గృష్ణుని సందర్శనం బిహపర సాధనం బని తలంచి యందులకు సమ్మతించెను. సాధారణముగా గొప్ప వారిని జూచుటకు రిక్తహస్తములతోఁ బోరాదు. ఏదైన గానుకఁ గొనిపోవుట యాచారమై యున్నది. ఇప్పుడు దుర్భర దారిద్ర్యముచే బీడింపఁబడుచున్న కుచేలుఁడు కృష్ణున కేమి గొనిపోవును? తన యభిప్రాయము భార్య కెఱింగించెను. అందులకామె యింటనున్న కొన్ని యటుకులు జీర్ణమైన నాథుని యుత్తరీయము కొంగునఁ గట్టెను. అంతట గుచేలుఁడు గోవిందదర్శనోత్సాహమున బయలుదేఱిపోవుచు మార్గమధ్యమునఁ దనమనంబున "నేను ద్వారకానగరమెట్లు ప్రవేశింతును? అప్పుండరీకాక్షుని దర్శనం బెట్లు నాకు లభించును? మందిరపాలకులు నన్నుఁజూచి పేదవిప్రుండని యడ్డువెట్టక యుందురా? అర్థశూన్యుండనగు నేను వారి కేమి యిచ్చి మందిర ప్రవేశము సేయగలను?" అని తలంచుచు దినదిన ప్రయాణంబులు చేసి నెమ్మదిగా ద్వారకానగరంబును బ్రవేశించి, యచ్చట వారిచే మార్గము గనుగొని కృష్ణుని మందిరమును జేరెను. రుక్మిణి మొదలగు కాంతలతో కృష్ణుఁ డంతఃపురమున వినోదగోష్ఠిం

దగిలియుండెను. కుచేలుఁడు మందిరముముందు నిల్చి ద్వార పాలకులఁ జూచి "అయ్యలారా! నేనొక పేదపాఱుఁడను. శ్రీకృష్ణునకు బాల్యసఖుఁడను. నన్నుఁ గుచేలుఁ డందురు. నాయందుఁ గరుణవహించి నారాక నమ్మహానుభావునకుఁ దెలియఁజేయుఁ" డని దైన్యముదోప నడిగెను. ద్వారపాలకులు మారుపలుకకుండ భగవానుఁడగు కృష్ణుని సన్నిధికిఁ బోయి కుచేలునిరాక నెఱింగించిరి. వెంటనే యాతనిని 'లోపలఁ బ్రవేశ పెట్టుఁడని కృష్ణుఁడు ద్వారపాలకుల కాజ్ఞనిచ్చెను. కుచేలుఁడు భటులవలన నామాట నెఱింగి సంతోషించి మందిరంబు బ్రవే శించెను. తనకడకు వచ్చుచున్న యశ్రాంత దారిద్ర్య పీడితుఁ డును, గృశీభూతాంగుఁడును, జీర్ణాంబరుఁడును నగు కుచేలునిఁ జూచి, శ్రీకృష్ణుఁడు తల్పము దిగి యెదురుగాఁబోయి నమస్క రించి కౌఁగిలించుకొని తోడితెచ్చి తల్పంబునఁ గూర్చుండఁ బెట్టి, యాతని పాదములు విమలసలిలంబులఁ గడిగి తజ్జలము శిరముపైఁ జల్లుకొనెను. ఇంతియేగాక యమ్మధుసూదనుండు మార్గశ్రమము వాయఁ గుచేలుని శరీరమున గంధమలఁది తాళవృంతముచే విసరెను. భగవంతుఁ డట్లు సేయుటఁజూచి రుక్మిణీదేవికూడ నా ధరామరపుంగవునకు జామరములువీచెను. అచ్చట నున్న శుద్ధాంతకాంతాజనంబు లిది యంతయుఁజూచి తమతమ మనంబులలో "ఈ భూసురోత్తముఁడు తొలి జన్మ మున నెట్టి సుకృతంబుల జేసియుండునో? యోగిజనదుర్లభుం డయిన శ్రీహరితల్పమునఁ గూర్చుండెను. ఈతనికి మున్నెవ్వరైన సరిరా" రని తలంచిరి. అంతట భగవంతుఁడైన వాసుదేవుఁడు కుచేలునిఁ గుశలప్రశ్నం బొనరించి, వారిరువురును సాందీపుని యొద్ద విద్యలగఱచునాఁటి కృత్యంబులు గొన్ని జ్ఞప్తికిఁ

దేఁదలఁచి యిట్లు పలికెను. "బ్రాహ్మణోత్తమా! మనము వారణాశీపురంబున సాందీపునియొద్ద విద్యలు గఱచునప్పుడు గురుపత్నిచే నియోగింపఁబడి యింధనార్థం బడవికిఁ బోవ, నప్పుడు సంధ్యాసమయం బగుటయు, జగత్ప్రళయము సంభవించు విధంబున వర్షము వచ్చుటయు, నందు మనము తడియుటయు, జగంబెల్ల నంధకార బంధురమై యుండుటచే నందుండి రాలేక తెల్లవాఱి గృహంబుఁ జేరుకొనుటయు నీకు జ్ఞాపకమున్నదా!" మురహారుని మధురవాక్యములు విని యా కుచేలుఁడు "కృష్ణా! మనము గురునిచెంత నున్నప్పుడు చేయనిపను లెవ్వియున్నవి? త్రిజగద్గురుఁడవగు నీకు గురుఁ డెవ్వఁడు? ఇది యంతయు లోకవిడంబనముగాదె!" యని పలికెను. కుచేలుని వాక్యములకు భగవంతుఁడునవ్వి "మిత్రమా! నీవిచ్చటికివచ్చునప్పుడు నాయందుఁ బ్రేమచే నుపాయనంబుగా నేపదార్థంబుఁ దెచ్చితివి? నీవు తెచ్చినది లేశమయినను మహామేరువుగనంగీకరింతును. దుష్టవర్తనుం డగువాఁడు నాకు మేరువు నొసంగినను నయ్యది నాకు సమ్మతము కాదు.

క. దళమైనఁ బుష్పమైనను
ఫలమైనను సలిలమైనఁ ♦ బాయని భక్తిం
గొలిచిన జను లర్పించిన
నెలమిన్ రుచిరాన్నముగనె ♦ యేను భుజింతున్"

అని పలికెను. కుచేలుఁడు తాను దెచ్చిన యటుకుల సమర్పింపనేరక మోము వాంచి పలుకక యుండెను. అప్పుడు ముకుందుండు తనమనంబున "కుచేలుఁడు పూర్వజన్మమున నైశ్వర్యగర్వంబున నన్ను సేవింపలేదు. ఇప్పుడు నిజకాంతా

ప్రేరేపణమున నాకడ కరుదెంచెను. మహేంద్రవైభవం బీతనికిఁ గూర్పవలయు" నని తలంచి, యా బ్రాహ్మణుని ఖండోత్తరీయముచెంగునఁ గట్టఁబడిన మూటంగని యిది యేమియని యడుగుచు నమ్ముడివిప్పి, పిడికెఁ డటుకులు పుచ్చుకొని నోట వేసికొని, తక్కినవిగూడ నారగింపఁ జేతఁబట్టెను. అప్పుడు రుక్మిణీదేవి శ్రీహరి కరకమలంబులఁ బట్టుకొని "నాథా! ఈ కుచేలుని బహు భాగ్యవంతునిగాఁ జేయుట కివియ చాలు" నని వారించెను.

కుచేలుఁ డారాత్రి గోవిందుని మందిరమున సుఖముగా భుజించి, మఱునాఁడరుణోదయంబున భగవంతుని యనుజ్ఞవడసి, నిజగృహాభిముఖుఁడై బయలుదేఱెను. మార్గమధ్యమునఁ దన మనంబునఁ గృష్ణుఁడొనర్చిన సత్కారములఁదలఁచి యిట్లనుకొనెను. "నా పుణ్యావశమున నఖిలజగత్కర్తయగు హరినిఁ జూచితిని. కృపణస్వభావుఁడనైన నే నేడ? రమాకాంతుఁడగు కృష్ణుఁడేడ! తోడఁబుట్టినవాని చందమున నన్నుఁ గౌఁగిలించికొని, నిజతల్పమునఁ గూర్చుండఁబెట్టుకొని, చామరానిలమున గతశ్రమునిఁ జేసెను. శ్రీమన్నారాయణుఁడగు నాతఁడు నాకిట్టి సత్క్రియలు నెఱపెను. కాని సంపదంధుఁడైనచోఁ దన్ను భజింపఁడని తలంచి కాఁబోలు నాకు విత్తమేమియుఁ గూర్పలేదు. కాకున్నచో నన్ను సర్వవస్తు పరిపూర్ణునిఁగాఁ జేయక యుండునా?" అని తలంచుచు నిజపురంబునకుఁ జనెను. అందు అంతకు మున్నులేని చంద్రకాంతోపలసౌధములును, మహోద్యానములును, విమలజల పూరిత కాసారములును, అనేక దాస దాసీ జనంబులును గల యొక్క దివ్యసదనంబు గాంచి

యాశ్చర్యమందుచుండ లోపలనుండి దివిజవనితలఁ బోలు దాసీ జనంబులు వచ్చి యా కుచేలుని దోడ్కొనిపోయిరి. కుచేలుని భార్య యాతని కెదురుగావచ్చి నమస్కరించి పూజించెను. కుచేలుఁడు తనకిట్టి సంపదలు హరికరుణవలనఁ గలిగెనని తలంచి, సంతోషించి యమ్మాధవుని యడుగులు నిరంతరము మనంబున నిలిపి సేవించుచుఁ గొంతకాలము గడిపి యైశ్వర్య విముఖుఁడై కానలకేగి తపము గావించి భగవంతుని సన్నిధిఁ జేరెను. మహాత్ముల హృదయములను సంపద లరికట్టలేవుకదా !

## ౧౩. భరతుఁడు

పూర్వము ఋషభుండను నృపాలుఁడు గలఁడు. ఆతనికి నూర్వురు పుత్రులు పుట్టిరి. అందులో భరతుఁ డగ్రజుఁడు. ఈ భరతునిచే మున్ను పాలింపఁ బడుటచేతనే యీ వర మను భారతవర్షమను పేరుగలిగెను. ఆతని తమ్ములేలిన ప్రదేశ ముల కాయా పేరులు వచ్చెను. ఋషభుఁడు తపమునకుఁ బోవుచు భరతుని రాజుగాఁ జేసినప్పు డాతఁడు కుమారులకు "శ్రీహరిని నిరంతరము సేవించు చుండవలయును. దీనజనరక్షణము వహించి యుండవలయును. దుర్జనులను జేరనీయరాదు. ఇహలోక సౌఖ్యములకై మానవులకు సాధారణముగా ద్రవ్యాశ యుండును. ద్రవ్యాశ యనేక పాపకార్యములఁ జేయించును. కావున నట్టిది విడువవలయును. బుద్ధిని నిరంతరము ధర్మ పథంబునం దుంచవలయును. బ్రాహ్మణులు దైవముతో సమానులని పూజింపవలయును" అను మొదలగు నీతుల నుపదేశించెను.

భరతుఁడు నృపాలుఁడై ధర్మసంధుఁ డని ప్రజలు పొగడ రాజ్యపరిపాలనము సేయుచుండెను. అతని కైదుగురు కొడుకులు పుట్టిరి. ఆతఁడు చిరకాలము రాజ్యముఁ బరిపాలించి, తన సంపదలన్నియుఁ గుమారులకు సమముగాఁ బంచియిచ్చి, రాజ్యమును, నైహికసౌఖ్యములను బరిత్యజించి తపమునకుఁ బోయి గండకీతీరమున నాశ్రమమును గల్పించుకొని యుండెను.

ఇట్లుండి యొక దినమున భరతుఁడు స్నానమునకై యరిగెను. అప్పుడు నిండుగర్భము ధరించిన యొక హరిణి నీటి కొఱకు నదికివచ్చి త్రాఁగుచు సింహగర్జనము విని ముందునకు దుమికెను. అంతట గర్భములోని పిండము నీటిపైఁబడెను. లేడి ప్రాణముల విడిచెను. కరుణారస హృదయముగల భరతుఁడు నీటిపైఁ దేలియున్న హరిణపోతమును నిజాశ్రమంబునకుఁ గొని వచ్చి మిగుల ముద్దుగాఁ బెంచుచుండెను. అది యెప్పుడును నాతని దాపుననుండి సంతోషము కలిగించుచుండెను. ఇట్లు కొన్నాళ్ళు గడచెను. అతనికి మరణకాలము సమీపించెను. ఆ లేడిపిల్ల నెట్లు విడిచిపోదునా యని యాతఁడు చింతనందుచు దానిమీఁదనే ప్రాణములను బెట్టుకొని శరీరము విడిచెను. అందుచే నతఁడు మరల హరిణజన్మమెత్తెను. ఇట్లు హరిణమైనను భగవద్భక్తిఁ గలుగుటచేఁ బూర్వజ్ఞానమునుఁ గలిగి యుండెను. హరిణంబై యిటునటుఁ దాయా యటవీప్రదేశంబుల సంచరించుచు, గొన్నాళ్ళకు శరీరమువిడిచి యంగిరసుండను బ్రాహ్మణునకుఁ బుత్రుఁడై జనించెను.

అంగిరసునకు ఇరువురు భార్యలుగలరు. ఈ భరతుఁడు రెండవభార్యకుఁ బుత్రుఁడు. పెద్దభార్యకుఁ గూడ కొడుకులు

నెలకు. భరతుఁడు విజ్ఞానియైనను వెఱ్ఱివానివలె సంచరించు చుండెను. కొన్నాళ్ళకు భరతునితల్లిదండ్రులు గతించిరి. వెఱ్ఱివాని వలె నెప్పుడును దిరుగుచునుండు భరతునిపైఁ దక్కిన సోదరుల కసూయగలిగి, యాతని నింటిపనులు చక్కబెట్టుటయందు నియమించిరి. వారితని నేమన్నను గోపించుకొనక, చెప్పినపను లెల్ల శ్రద్ధతోఁ జేయుచుండెను. ఈతఁ డతిశాంతపురుషుఁడు; గర్వరహితుఁడు. ఒకనాఁడు సోదరులచేనియమింపఁబడి యీతడు రాత్రిసమయమున బొలముగాచుటకుఁ బోవ, వృషలుఁడను రాజేంద్రుని భటులు బంధించిరి. కాళికాదేవి యాలయము నకు బలినిమిత్తము గొనిపోయిరి. వారితనిని గొనిపోవునప్పుడు విచారింపలేదు; భయమందలేదు; హరిని ధ్యానించుచు సంతో షమునఁ బోయెను. భటులు గొనివచ్చిన భరతుని వృషలరాజు స్నానముఁ జేయించి నూతనవస్త్రములు ధరింపఁజేసి, భోజ నమునఁ దృప్తునిఁజేసి దేవీసముఖమున నిలువఁబెట్టెను. అప్పు డైనను నాతఁ డధైర్యమును బొందలేదు. శ్రీహరియందే చిత్త మును నిలిపి యుంచెను. భరతుని బ్రహ్మతేజము కాళికాదేవికే యచ్చెరువు గలిగించెను. అంతట నమ్మహాదేవి భయంకర స్వరూపముదాల్చి, భరతుని వధింపఁదలఁచిన వృషలరాజును భటులతోఁ గూడఁ జంపివేసెను. పిదప భరతుఁడు హరినామ స్మరణఁ జేయుచుఁ దమ పొలమునుజేరి యెప్పటి యట్లుండెను.

భరతుఁడు తన సోదరులచే నెప్పుడును బొలముగాచు నుద్యోగమునందే నియోగింపఁబడి యుండెను. అందుచేత నాతఁ డనుదినమును బొలమునకుఁ బోవుచుండెను. ఒకనాఁడు రహూగణుఁడను రాజు కపిలమహామునివలన సద్బోధ వడయు టకై శిబికమీఁద భరతుఁడున్న పొలము మీఁదుగఁ బోవు

చుండెను. శిబికావాహకులు భరతునిఁజూచి యాతనిచేత శిబిక మోయింపఁదలంచి పట్టుకొనివచ్చి శిబిక నాతనిభుజమునఁబెట్టిరి. భరతుఁ డతిశాంతమువహించి, యేమియు మాటలాడక శిబికను మోయుచుండెను. కాని శిబిక మోయుట యాతని కెప్పుడును నలవాటు లేకపోవుటచే నాతఁ డెత్తుపల్లములం జూడక నడచు చుండెను. శిబికలోపల నున్న రాజు శిబిక యట్లు పోవుచుండు టకుఁ గారణ మేమని యడుగ శిబికమోయువారు భరతునిఁ జూపి యాతని నడక యట్లున్నదని చెప్పిరి.

ఆ మాటలకు రహూగణుఁ డాగ్రహించి భరతుని విలోకించి, "శిబికను వక్రమార్గమున నడపించుచున్న నిన్ను శిక్షించెద" నని పలుక, భరతుఁడు 'రాజేంద్రా! అహంకారము, రోషము, మోహము మొదలగునవి జయించినవాఁడే ధన్యాత్ముఁడు. నన్ను సేవకునిగ భావించి శిక్షించెదనని పలికితివి. యజమాని యనియు, సేవకుఁ డనియు భేదము జీవునకు లేదు. నీవు పూర్వజన్మజ్ఞానము కలిగియుండనివాఁడ వగుటచే నట్లు పలికితివి. నన్ను శాసింపఁ దలఁచితివి. నీ దండన నా విషయమున నావంతయుఁ బనిసేయ" దని నిర్భయముగాఁ బలికెను.

భరతుని వాక్యములకు రాజేంద్రుఁడాశ్చర్యమునుబొంది, యాతఁడు వెఱ్ఱివానివలె నుండెను గాని మహాజ్ఞాన సంపన్నుఁడని తలంచి వెంటనే శిబికదిగి యాతనిపాదములపైఁ బడి జ్ఞానోపదేశంబుఁజేసి రక్షింపుమని ప్రార్థించెను. భరతుఁడు రహూగణుని విజ్ఞానిఁగాఁజేసి నిజపురమునకుఁబోయి హరిని సేవించుచుఁ గాలము గడపెను. ఆత్మజ్ఞానమహిమ యీ చరితముచే నెట్లు ప్రకటితమాయెనో చూడుఁడు.

---

## ౬౪. చిత్రకేతుఁడు

క. "సతులెవ్వరు సుతులెవ్వరు
పతులెవ్వరు మిత్రశత్రు ♦ బంధు ప్రియ సం
గతులెవ్వరు సర్వాత్మక
గతుఁడై గుణసాక్షియైన ♦ ఘనుఁ డొక్కనికిన్."

పూర్వము చిత్రకేతుఁడను నరపాలుఁ డొకఁడు శూరసేన దేశమును బరిపాలించు చుండెను. "ధర్మము జయము నిచ్చు" నను వాక్యము నతఁడు బాగుగ గ్రహించి రాజ్యపరిపాలనము సేయుచుండుటచేత నాతనిని బ్రజలెల్లరును ధర్మదేవతావతార మని చెప్పుకొనుచుండిరి. ఆతనికి సంపదలకుగాని, భోగములకుఁగాని, సౌఖ్యములకుఁగాని యావంతయు గొఱంతలేదు. సమస్తవిధముల నాతఁడు రెండవమహేంద్రుఁడే యని చెప్పవచ్చును. ఆతనికి ననుపమాన సౌందర్యవంతులగు భార్యలు పెక్కండ్రు గలరు. ఎట్టి కుబేరసంపదలున్న నేమి? ఎట్టి వైభవమున్న నేమి? ఎందఱు సతులున్న నేమి? వంశాభివృద్ధికిఁ గారణుఁడగు నొక్క కుమారుఁ డయినను లేఁడు. ఈ విషయమై చింత యాతని ననుదినంబును వేధించు చుండెను. ఇట్లుండ నారాజేంద్రుని మందిరంబునకు నంగిరసుండను మునిచంద్రుఁడు వచ్చెను. చిత్రకేతుఁ డామునీంద్రు ననేక విధములఁ బూజించి యానాఁడు తన మందిరమున నిలిపెను. అంగిరసుఁడు చిత్రకేతుని చింతకుఁ గారణంబెఱింగి, యాతనియెడల గరుణ వహించి "రాజా! నీవు నందనోదయ భాగ్యంబు నందనయితిని కదా యని చింతించు చున్నావు. ఇఁక నీవీ విషయమును గూర్చి చింతింపవలదు. నేనొక ఫలమునిచ్చెదను. దానిని నీ

యగ్రమహిషి యగు కృతద్యుతి కొసంగుము. నీకు నందనుఁ డుదయించు" నని పలికి యొక ఫలము నిచ్చి చనెను. చిత్ర కేతుఁడు మహానందమును బొంది యాఫలమును గృతద్యుతి కిచ్చెను. దాని నామెభుజించి, గర్భము ధరించి కాలక్రమమున నొక శుభదినమున నొక కొడుకుం గనెను. అంతకుమున్ను సుపుత్రోదయమునకై యెంతయో చింతనందుచున్న యా చిత్రకేతుఁడు నాఁడు సుతుఁడు జనించెనన్న మాటవిని, పొందిన సంతోషమునకు మేరలేదు. పౌరులుగూడ రాజేంద్రునకుఁ గొమరుఁడు జనించెనని విని తమ సంతోషము సూచించుటకుఁ, దమతమ గృహములన్నియుఁ దోరణములతో నలంకరించి యుత్సవములను జేసిరి. చిత్రకేతుఁడు తనకు గులదీపకుఁడగు కుమారుఁడు జనించెనను సంతోషమున భూసురుల కనేక విధములగు దానములఁ జేసెను. ఇట్లు జనించిన నందనుని తల్లి దండ్రులు ముద్దుగాఁ బెంచుచు నానందించు చుండిరి. అక్కుమారుఁడును దినదిన ప్రవర్ధమాన చంద్రునిగతి నొప్పుచుండెను.

కృతద్యుతియందు గుమారుఁడు పుట్టిననాటనుండియు జిత్రకేతుఁ డామె మందిరమందే యుండి, యామెనే యెక్కువ ప్రేమతోఁ దిలకించుచుఁ దక్కిన సతీమణుల మందిరములకుఁ బోవకయుండెను. ఈ కారణమున సవతులెల్లరును గృత ద్యుతియం దసూయ వహించిరి. కృతద్యుతియందుఁ బుత్రుఁడు పుట్టుటచేతనే రాజేంద్రుఁ డామెపై నంత యనురాగము వహించి యున్నాఁడని వారు దలంచి, సమయము జూచి యాకుమారునకు విషము బెట్టిరి. విషముంగ్రోలిన యాకుమా రుఁడు పక్కమీఁదనే ప్రాణములు విడిచి పడియుండెను. కొంత సేపటికిఁ దల్లి వచ్చి కుమారుని నిద్ర మేల్కొలుపసాగెను.

మృతుఁ డెట్లు లేచును ? తుదకా బాలుఁడు మృతుండయ్యెనని గ్రహించి పెద్దపెట్టున రోదనము సేయఁ దొడంగెను. ఈమె రోదనము విని చిత్రకేతుఁడు వచ్చి మృతుండైన పుత్రునిపైఁ బడి స్త్రీకంటె నెక్కువగ విలపించెను. పుత్రశోకము దుస్సహమయినది కదా ! ఆ సమయమున నయ్యెడకు నంగిరసుఁడు నారదసహితుఁడై యరుదెంచెను. చిత్రకేతుఁ డా మునీంద్రుని పాదములపై బడి "మహాత్మా ! నీ కటాక్షమునఁ బుత్రుఁ డుదయించెనని యెంతయో సంతోషముతో నుంటిని. అట్టి నా సంతోషమంతయు నేఁ డడుగంటినది. ఇక నాకేదిదిక్కు ?" అని పరిపరివిధముల శోకించెను. దుర్భరశోకాబ్ధిని మునింగియున్న యా రాజుం గాంచి యంగిరసుండిట్లనెను. "నరపాలా ! నీ వేల దుఃఖించెదవు ? ఈ మృతజీవుఁడు నీ కేమగును ? జనన మరణములు ప్రతిజీవికిని సహజములు. ఎవ్వరును నాచంద్రార్కతారావనీ శరధిస్థాయిగ భూమిపై నుండరు. నీవు విచారించినందువలనఁ బ్రయోజనము లేదు."

అని పలికి యాతనికిఁ దత్త్వోపదేశముఁ జేసి, బాలుని మృతకళేబరమును విలోకించి "జీవుఁడా ! నీవు తనువు విడిచితి వని నీ జననీ జనకులు మిగుల దుఃఖించుచున్నారు. కావున, వీరికి ముదముఁగూర్చుటకు మరల నీ కళేబరంబునఁ బ్రవేశించి యీసంపదల కధీశుఁడవై సౌఖ్యభోగంబుల నందు" మని పలికెను. అందులకు బాలుని కళేబరముననున్న జీవుఁడు "మునీంద్రా! వీరెవ్వరు ? నేనెవ్వఁడను ? నాకును వీరికిని నెట్టిసంబంధమున్నది? వీ రేజన్మమున నాకుఁ దల్లి దండ్రులై యుండిరో నీవు వచింపఁ గలవా ? నాకు వీరితో సంబంధము లేదు. వీరికి నాతో సంబంధము లేదు. నాకొఱకు వీరు వగవం బనిలే" దని పలికి కళే

బరమును విడిచి వెడలెను. నారదాంగిరసుల యుపదేశమునఁ జిత్రకేతుఁడు విచార ముడిగి కుమారునకుఁ జేయవలసిన ప్రేత కృత్యంబులఁ జేసి, సంసారమును బరిత్యజించి కాళిందీ నదీతీర మునకుఁ బోయి యచ్చట శ్రీహరిం గూర్చి ఘోరమయిన తపస్సుఁ జేసి హరికరుణచే నొక దివ్యవిమానమునుఁ బడసెను.

## —♦ ఈశ్వరధిక్కారము ♦—

శ్రీమన్నారాయణుని యనుగ్రహమున లభించిన విమానము నెక్కి యాచిత్రకేతుఁడు హరినామసంకీర్తనము సేయుచు మూఁడులోకములయందు నిచ్చవచ్చినట్లు జరించుచుండెను. ఇట్లుండ నొకదినమున నాతఁడు కైలాసమునకుఁ బోయెను. ఆ సమయమునఁ బరమేశ్వరుఁడు పార్వతితో రత్నఖచితపీఠంబున నాసీనుఁడై యుండెను. అనేక మునీంద్రులు వారిని బరివేష్టించి యుండిరి. లోకజనని యగు భవాని రుద్రుని యంకపీఠమున నాసీనయై యుండుట విలోకించి, చిత్రకేతుఁడు నవ్వుచు "ఈ పరమేశ్వరుఁడు సమస్తధర్మసంవేది. జగదాధారుఁ డని ఋషులచే వినుతింపఁబడుచుండును. మహాత్ముఁడగు నీతఁడే లజ్జఁ బరిత్యజించి భార్యను తొడపై నింతమంది మునుల సముఖమున గూర్చుండఁబెట్టుకొనెను. భగవంతుఁడే యిట్లు జేసినఁ దక్కిన వారిం గూర్చి పలుకనేల" యని పలికెను.

చిత్రకేతుని వాక్యములు విని శంకరుఁ డేమియు మాటలాడలేదు. భవానికిమాత్ర మలుక వొడమెను. ఆ మహాదేవి చిత్రకేతునిఁ గాంచి, "రాజా! భగవంతుఁడైన నానాథుని కృత్యములకు యోగీశ్వరులయినను బరిహాసముగ మాటలాడరు. వారికన్న నీవు నిఖిలధర్మసంవేదివి కాఁబోలు! పరమేశ్వరుని

దూపించు నీవు హరికెట్లు భక్తుఁడవయితివో తెలియఁజాలక యున్నాను” అనిపలికి, “పరమేశ్వరుని దూపించిన నీవు రాక్షసుఁడవై జన్మింతువుగాక” యని శపించెను. చిత్రకేతుఁడు భయమంది తన యపరాధమును మన్నింపు మని పార్వతి పాదములపైఁబడి వేడికొనెను. ఈ చిత్రకేతుఁడే పార్వతీదేవిశాపమున వృత్రాసురుఁడై పుట్టి, యింద్రునిచేఁ గూలి శాపమును బాసి హరిభక్తుఁడై వెలసిల్లెను.

---

## ౧౫. ప్రహ్లాదుఁడు

“సీ. తనయందు నిఖిలభూ ♦ తములందు నొకభంగి
సమహితత్వంబునఁ ♦ జరుపువాఁడు
పెద్దలఁబొడగన్న ♦ భృత్యునికై వడిఁ
జేరి నమస్కృతుల్ ♦ సేయువాఁడు
కన్నుదోయికి నన్య ♦ కాంత లడ్డంబైన
మాతృభావముఁజేసి ♦ మరలువాఁడు
తల్లిదండ్రుల భంగి ♦ ధర్మవత్సలతను
దీనులఁగావఁ జిం ♦ తించువాఁడు

తే. సఖులయెడ సోదరస్థితి ♦ జరుపువాఁడు
దైవతములంచు గురువులఁ ♦ దలఁచువాఁడు
లీలలందును బొంకులు ♦ లేనివాఁడు
లలితమర్యాదుఁడైన ప్ర ♦ హ్లాదుఁ డధిప !”

ఒకనాఁడు తపశ్శాలురును, జితేంద్రియులును నగు సనకసనందనాదులు భగవంతుం డగు శ్రీహరిని దర్శింపఁగోరి

వైకుంఠమునకుఁ బోయిరి. శ్రీహరిమందిరము జయ విజయులను వారిచే రక్షింపఁబడుచుండెను. మునీంద్రులు మందిర ప్రవేశము చేయఁబోవఁగా, ద్వారపాలకులు వారిం గాంచి "శ్రీహరి యిందిరాదేవితోఁ కేళీమందిరమున నున్నాఁడు. కావునఁ బోఁగూడ" దని వారించిరి. మునులు జయవిజయులఁ జూచి "ఎట్టిసమయములయందయినను మేము నిరాటంకముగఁ బోవచ్చును. మారాకకు శ్రీహరి సంతోషించునుగాని మిమ్ము శిక్షింపఁడు" అని శాంతముతోఁ బలికిరి. దౌవారికులు వారి వాక్యములు వినక యావలకు నెంటిరి. మునిపుంగవు లందుల కలిగి "దైత్యులై పుట్టుఁ"డని వారికి శాపమిచ్చిరి. జయవిజయులు పశ్చాత్తాపము నంది తాపసుల పాదములపైఁబడి రక్షింపుమని ప్రార్థించిరి. మునీంద్రులు కరుణవహించి వారిని విలోకించి "జయవిజయులారా! మీరు మూఁడు జన్మములు శ్రీహరితో వైరంబుననుందురు. అటుపై శ్రీహరిసాన్నిధ్యమును జేరుదురు" అని పలికి వారు శ్రీహరిం దర్శించి చనిరి.

కొంతకాలమునకుఁ గశ్యపునకు దితి యను భార్య యందు హిరణ్యాక్ష, హిరణ్యకశిపులను దైత్యులు జన్మించి లోకములకు బాధలు గలుగజేయసాగిరి. ఇందు హిరణ్యాక్షుఁడు తన్నెవరును గెలువఁజాల రని గర్వంబెర్చి సకల లోకముల యందుఁ జరించుచుఁ దుదకు వరాహస్వరూపుండగు శ్రీహరిచే నేలఁగూలెను. హిరణ్యకశిపుఁడు తమ్మునిమృతివిని, దుఃఖించి క్రమ్మఱ ధైర్యము దెచ్చుకొని, "యాతనిని వధించిన హరినిం గూల్చి తద్రక్తముచే నాతనికిఁ దర్పణము గావింతుఁ గాక" యని శపథము వహించి మంత్రుల రావించి యిట్లు పలికెను. "అమాత్య పుంగవులారా! వింటిరిగదా!

నా తమ్ముఁడగు హిరణ్యాక్షుని శ్రీహరి వరాహరూపమున వధించినాఁడఁట. ఆతనిని వధించువఱకు నాకు నిద్ర పట్టదు. మీ రెట్లయిన నాతని జాడలు దీయవలెను. ఆతఁడు బహుమాయా వేషియై యున్నాఁడు. సర్వవ్యాపి యని చెప్పుదురు. ఎచ్చట యజ్ఞాదులు జరుగుచుండునో, ఎచ్చట విప్రులు వేదాధ్యయనము సేయుచుందురో, ఎచ్చట దానము, తపము, ఆచారము, ధర్మము మొదలగునవి యుండునో, ఎచ్చట గోబ్రాహ్మణాభివృద్ధి యుండునో, యాప్రదేశములయందా శ్రీహరి యుండును. అట్టి ప్రదేశములు మీరు నశింపఁజేయుదురేని యాతఁడు బయల్పడును. శ్రీహరి నేలగూలెనేని దేవతలందఱు నిరాధారులై నశింతురు. అప్పుడు మన దైత్యసామ్రాజ్య మభివృద్ధిఁ బొందును."

హిరణ్యకశిపునియాజ్ఞ ననుసరించి రాక్షసవీరు లందఱును బయలుదేఱి సర్వలోకములను హింసింపఁ దొడఁగిరి. హిరణ్యకశిపుఁడు పుత్రశోకమునఁ గూలియున్న తల్లి నోదార్చి, తపము సేయుటకై మంథరాచలమునకుఁ బోయెను. అచ్చట నీతఁడు బ్రహ్మనుఁగూర్చి ఘోరమైన తపస్సుఁ జేసెను. చతుర్ముఖుఁడు సాక్షాత్కరించి యాతనింగాంచి "కశ్యపపుత్రా! నీవలె నెవ్వరును నిట్టి యుగ్రమయిన తపము సేయలేదు. పిపీలికలు నీర క్తమాంసములుదిని శల్యావశిష్టునిఁగాఁ జేసినను నీవు నిష్ఠతో నుంటివి. కోరినవరంబు లొసంగెద లెమ్ము" అని పలికి తన కమండలూదక మాతనిపైఁ జల్లెను. అంతట హిరణ్యకశిపుఁడు సంతోషించుచు లేచి బ్రహ్మకు నమస్కరించి, యాతని ననేక విధముల సన్నుతించి, "దేవా! నీకు నాయందు దయయుండి వరంబు లీయదలఁచితివేని, గాలియందుఁగాని, భూమియందుఁ గాని, అగ్నియందుఁగాని, జలములందుఁగాని, దిక్కులందుఁగాని,

రాత్రింబవళ్ళయందుఁగాని, దేవమానవ జంతుసంతతిచేతఁగాని, యస్త్రశస్త్రములచేతఁగాని మరణము సంభవింపకుండునట్లు వరంబులిమ్ము", అని వేఁడెను. బ్రహ్మ యందులకు సమ్మతించి "ఇట్టి వరంబులు మున్నెవ్వరును గోరియుండలేదు. నేనిచ్చియుండలేదు. నీయందున్న దయచే నీతపమునకు మెచ్చి యిచ్చితిని. బుద్ధిమంతుఁడవై యుండు" మని చెప్పి యంతర్ధానము నందెను.

దానవేంద్రుఁడు తపము సేయుటకు వచ్చినపు డింద్రుఁడు వాని నగరముపై దండెత్తిపోయి, గర్భవతియైన దానవాధీశుని భార్యయగు లీలావతిని జెఱఁగొని పోవుచుండెను. ఆమె యనేక విధముల నింద్రుని బతిమాలెను. ఆతఁ డామెనుజూచి "నీకు జనించు కుమారునివలన లోకముల కపాయము కలుగును. నీవు ప్రసూత వగువఱకు బంధించి యటుపై నీకు జనించు బాలుని మదీయ వజ్రాయుధముచే వధించి నిన్ను విడుతును. నేనునిన్ను దురుద్దేశముతోఁ గొనిపోవుట లేదు" యనిపలికెను. ఆపలుకుల కామె రోదనముఁ జేసెను. ఆ యార్తనాదము విని యయ్యెడకు నారదుఁ డరుదెంచి, కారణం బరసి, యింద్రుని విలోకించి "మహేంద్రా! శాంతింపుము. కాంత నిట్లుసేయుట న్యాయము కాదు. ఈమె మహాసాధ్వి. ఉత్తమురాలు. ఈమెకు జన్మించు కుమారుఁడు పరమభాగవతోత్తముఁ డగును. వానివలన లోకముల కుపకారము గలుగును" అని వచించి యింద్రునిఁ బంపివేసి లీలావతిం గాంచి యిట్లు పలికెను. "సాధ్వీమణీ! నీవు భయమందవలదు. నీకు సకలసద్గుణసముద్రుఁడగు కుమారుఁ డుదయించును. నీ భర్త తపమునుండి వచ్చువఱకును నీవు మదీయాశ్రమంబున నుండుము. నీకుఁ బరిచర్యకై వెక్కుండు

మునికన్యక లుండిరి.” లీలావతి నారదుని మాటలకు విధిలేక సమ్మతించి యాతని యాశ్రమమునకుఁ బోయెను.

నారదాశ్రమమున లీలావతి సుఖప్రసూతయై యొక కుమారునిఁ గనెను. అతనికి నారదుఁడు ప్రహ్లాదుఁడను నామము బెట్టెను. హిరణ్యకశిపుఁడు తపమునుండి వచ్చుట యెఱింగి నారదుఁడు పుత్రసహితయగు లీలావతి నాతనికడకు దోడ్కొని పోయి యొప్పగించెను. హిరణ్యకశిపుఁడు నారదుని మిగులఁ బ్రశంసించి, కుమారునిఁజూచి సంతోషించి, యింద్రుని కృత్యమునకుఁ గ్రోధమువహించి యుండెను. హిరణ్యకశిపుఁడు హరిని సాధింతునని దేవతలను మునులను హింసింప నుద్యోగించెను. ఆతఁ డేదిక్కునకు వెడలునో, యెవ్వని బాధించునో యని యందఱును భీతిల్లుచుండిరి. ఆతఁడు పెట్టు కడగండ్ల కోర్వఁజాలక బృందారకు లెల్లరును శ్రీమన్నారాయణుని సన్నిధికిఁ బోయి దానవుని క్రూరకృత్యము లన్నియుఁ దెలిపి మమ్ము రక్షింపుమని వేఁడుకొనిరి. శ్రీహరి వారిం గాంచి “అమరులారా! మీరు భయమందవలదు. ఆ దైత్యుని సంహరించుట కిది సమయము గాకపోవుటచే శాంతము వహించియుంటిని. సాధుపులను, గోవులను, బ్రాహ్మణులను బాధపెట్టువాఁ డెప్పుడును వృద్ధిఁ బొందఁడు. వాఁడెప్పుడు తన తనయుని బాధించునో యప్పుడు వానిని సంహరింతు” నని పలికెను. దేవతలు సంతసించుచుఁ దమతమ నెలవులకుఁ బోయిరి.

ప్రహ్లాదుఁడు దినదిన ప్రవర్ధమానుఁడై యొప్పుచుఁ దల్లిదండ్రులచే గారాబముగఁ జూడఁబడుచుండెను. ఆతని చర్యలన్నియు నత్యద్భుతము గలిగించునట్టివై యుండెను. బాలుఁ

డయ్యుఁ బెద్దలనుజూచినయంతనే వినయముతో నమస్కరించు చుండును. పరస్త్రీలయెడల మాతృభావము వహించును. తన మిత్రులను సోదరులుగఁ జూచును. గురువులను దైవస్వరూపు లని భావించును. ఆటలయందైనను నసత్యమాడక యుండును. ప్రపంచమంతయు మాయయనియు, నేదియు స్థిరముగాదనియుఁ జెప్పుచుండును. శ్రీహరి సేవయే జీవులకు ముఖ్యమని నమ్మును. ఒక సమయమునం దీలోకమంతయు హరిమాయయని తలంచును. ఒకప్పుడు లోకమును మఱచి నిర్వికల్పసమాధినుండును. ఒక సమయమున హరిం జూచినట్లు నటించి యేమేమో మాటలాడును. ఒకప్పుడు పిచ్చివానివలె దిరుగును. ఆతనికి హరిభక్తి జన్మతోడనే కలిగినది. కావున నశాశ్వతములగు సౌఖ్య సంపదలయందు దన బుద్ధిని ప్రవేశపెట్టక యుండును.

## —♦ ప్రహ్లాదుని విద్యాభ్యాసము ♦—

ప్రహ్లాదుఁడీ తెఱంగున జరించుచున్నాడని హిరణ్యకశిపుఁడు విని "వీనికి విద్య గఱపినఁగాని బుద్ధిరా" దని తలంచి, కుమారునిజూచి "కుమారా! పురుషజన్మ మెత్తినందులకు విద్య నభ్యసింపవలయును. విద్యవలన విజ్ఞానము గలుగును. విద్య లేకున్న నజ్ఞుఁడగు" నని చెప్పి శుక్రాచార్య తనూజులగు చండామార్కుల రావించి 'ఈ కుమారుని విద్యాపారంగతునిఁ జేయుఁ' డనిజెప్పి వారి కొప్పగించెను. చండామార్కులు కుమారునిఁ దోడ్కొనిపోయి సమస్త శాస్త్రములు వానిచేఁ బఠింపఁజేసిరి. ఆతఁడు వాని నాక్షేపించుటగాని, చదువనని చెప్పుటగాని చేయలేదు. హరిపైనున్న తనభక్తి విడువలేదు.

అతఁ డెట్లయిన విష్ణుభక్తి విడుచుటకు గురువులు వివిధప్రయత్నములఁ జేసిరి. కాని లాభము లేకపోయెను. తోడిబాలురు గూడ ప్రహ్లాదుని మార్గమే యనుసరించుచుండిరి. ఇట్లుండ నొకనాడు హిరణ్యాకశిపుఁడు, తనపుత్రుఁ డేమిచదివెనో, జ్ఞాన మేవిధమున నభివృద్ధిఁబొందెనో కనుఁగొనఁ దలంచి, ప్రహ్లాదుని గురుసహితముగ రావించి, కుమారుం దనయంకమునఁ గూర్చుండఁబెట్టుకొని ప్రేమరస మొలుక ముద్దాడి, నెమ్మదిగా నిట్లనెను. "నాయనా! గురువులయొద్ద నీవేమి పఠించితివి? వేద శాస్త్రములు బాగుగాఁ జదివితివా? అజ్ఞానము నశించి జ్ఞాన పరిపూర్తిఁ బొందితివా? నీవు నేర్చిన విద్యలలో నీ చిత్తమున కేది ప్రీతిగనున్నదో చెప్పుము."

ఆపలుకులు విని ప్రహ్లాదుఁడు తండ్రికి నమస్కరించి యిట్లు చెప్పెను. "తండ్రీ! ఏమని చెప్పుదును? చదువులలో నున్న సారమెల్ల గ్రహించితిని. సంసార మను చీఁకటినూతిలో మునుంగక, నాది, నీది యనుభేదము పాటింపక లోకమందున్న ప్రతివస్తువు విష్ణుమయ మని తలంచుటయే మంచిది. నాచిత్త మంతయు శ్రీమన్నారాయణునియందు నిలిచియున్నది.

సీ. మందార మకరంద ♦ మాధుర్యమున దేలు
మధుపంబు వోవునే ♦ మదనములకు
నిర్మల మందాకి ♦ నీ వీచికలఁ దూఁగు
రాయంచ చనునె త ♦ రంగిణులకు
లలిత రసాల ప ♦ ల్లవ ఖాదియై చొక్కు
కోయిల సేరునే ♦ కుటజములకుఁ
బూర్ణేందు చంద్రికా ♦ స్ఫురిత చకోరక
మరుగునే సాంద్ర నీ ♦ హారములకు

తే. అంబుజోదర దివ్య ♦ పాదారవింద
చింతనామృత పాన వి ♦ శేషమత్త
చిత్తమేరీతి నిరతంబుఁ ♦ జేర నేర్చు
వినుత గుణశీల మాటలు ♦ వేయునేల !"

ప్రహ్లాదుని మాటలు దైత్యవల్లభున కాగ్రహము గలిగించెను. అతఁడు కుమారునిఁజూచి యిట్లనెను. "ప్రహ్లాదా ! ఈదుర్బుద్ధి నీకెవ్వరుగలిగించిరి ? ఇది నీకు గురువులుచెప్పిరా ? లేక నీకే తోఁచెనా ? నీవాక్యములు నాకు మిగుల నద్భుతమును గలిగించుచున్నవి. విష్ణుఁడనగా నెవ్వఁడనితలంచితివి ? ఆతఁడు మన కాజన్మవిద్వేషి; నీ పినతండ్రినిఁ జంపినవాఁడు. అట్టివానిని గీర్తించుచు మన దైత్యవంశాచారము మంటఁ గల్పుచుంటివే ? నీవు బాలుఁడవు. నీ కీబుద్ధి వలదు. తెలియక యిట్లు పలికితివని తలంచెదను. ఇఁకనైన నీదుర్బుద్ధి విడిచి గురువులు చెప్పిన శాస్త్రములను జదువుము."

ప్రహ్లాదుఁడు తండ్రిఁజూచి "తండ్రీ! నా కీబుద్ధి జన్మము తోడనే కలిగినది. శ్రీహరి సర్వవ్యాపి. నేను నీవు అను భేద దృష్టిగలవా రాతని జూడఁజాలరు. అట్టివారికి మోక్షము కలుగదు. నాచిత్త మెప్పుడును హరిసేవనే కోరుచుండు" నని నిర్భయముగాఁ బలికెను. ఆ మాటలకు చండామార్కు లాగ్రహమంది "బాలకా ! మేముచెప్పిన శాస్త్రములన్నియు విడిచి, హరిం గీర్తించుచు మాకుఁ దలవంపులు కలుగఁజేయుచుంటివి." ఇటు లనేకవిధంబుల నిందించి, హిరణ్యాకశిపునిఁ గాంచి యిట్లు పలికిరి. "దానవేంద్రా ! నీకీతఁడు శత్రుఁడుగాని పుత్రుఁడుగాఁడు. శిక్షాపాత్రుఁడుగాని రక్షాపాత్రుఁడుగాఁడు.

ఈబుద్ధి యీతనికి జనించినదేగాని యొరులు చెప్పినది కాదు. మే మెప్పుడును నిట్టి దుర్నీతులు బోధించువారము కాము. నిరంతరము నీ శ్రేయస్సునే కోరుచుందుము. మే మీతనిని మరలఁ గొనిపోయి మా కుశలత్వ మేర్పడ మేధాసంపన్నుని జేసి తెచ్చెదము. నీవు మాపైఁ గోపింపవలదు'' అని పలికి ప్రహ్లాదుని దోడ్కొనిపోయి వా రాతని కనేక శాస్త్రముల బోధించిరి.

ఇట్లు కొంతకాలము గడచినపిదప నొకనాఁడు చండామార్కులు ప్రహ్లాదుని లీలావతి కడకుఁ దోడ్కొనిపోయి యామెకు మ్రొక్కించిరి. లీలావతి కుమారునిదీవించి "వత్సా! నీవు బాలుఁడవు. శ్రీహరి నీతండ్రికి విరోధి. నీ వాతనిని గీర్తించుచుండుట నీతండ్రి కాగ్రహము గలిగించుచున్నది. కావున విష్ణుని తలఁపవలదు'' అని నీతులు గఱపి దైత్యేశ్వరుని సన్నిధికిఁ బంపెను. గురుపుత్రులు ప్రహ్లాదుని హిరణ్యకశిపునకుఁ జూపి "దానవేశ్వరా ! నీసుతుని శిక్షించి నీతికుశలుని గావించితిమి. పరీక్షింపుము'' అని పలికిరి.

తండ్రి కుమారుని గాఁగిలించుకొని, యంకమునఁ గూర్చుండబెట్టుకొని "నాయనా ! నీ వెప్పుడు విద్యాప్రవీణుఁడ వగుదువో యని నిరీక్షించుచుంటిని. నేటికి నా భాగ్యము ఫలించినది. తండ్రీ ! నీకు గురువులేమి చెప్పిరి ? నీవు చదివిన శాస్త్రములలో నొక పద్యమును జదివి యందలి తాత్పర్యము నెఱింగింపు'' మనెను.

ప్రహ్లాదుఁడు తండ్రికి నమస్కరించి "నాయనా ! నన్ను గురువులు మిగుల శ్రద్ధతో జదివించిరి. నేను సమస్తశాస్త్ర

రహస్యములను గ్రహించితిని. జన్మమెత్తినందులకు హరిని సేవించుటయే ఫలమని నేను బాగుగా గ్రహించితిని.

మ. తనుహృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్
దాసత్వమున్ వందనా
ర్చనమున్ సేవయు నాత్మలో నెఱుకయున్
సంకీర్తనల్ చింతనం
బను నీ తొమ్మిది భక్తిమార్గముల స
ర్వాత్ముఁ హరిన్నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలఁతున్
సత్యంబు దైత్యోత్తమా!

సీ. కమలాక్షు నర్చించు ♦ కరములు కరములు
శ్రీనాథు వర్ణించు ♦ జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁజూచు ♦ చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు ♦ శిరము శిరము
విష్ణు నాకర్ణించు ♦ వీనులు వీనులు
మధువైరి దవిలిన ♦ మనము మనము
భగవంతువలఁగొను ♦ పదములు పదములు
పురుషోత్తముని మీఁది ♦ బుద్ధి బుద్ధి

తే. దేవదేవునిఁ జింతించు ♦ దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు ♦ చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి ♦ గురుఁడు గురుఁడు
తండ్రి! హరిఁజేరు మనియెడి ♦ తండ్రితండ్రి!

సంసారవార్ధిఁ దరింపఁ జేయుటకు హరిభక్తియే నావ. అదియే మోక్షమునకు రాజమార్గము. హరిసేవ సేయని

వాఁడు ద్విపాదపశు వనంబడును" అని నిర్భయముగాఁ బలికిన. విని, హిరణ్యకశిపుఁడు మండిపడి గురువులం జూచి "మీరు నా కుమారుని నీతిపారగునిఁగా చేయుదుమని చెప్పి యిట్లు చేయుట ధర్మమా? మీరు కపటబ్రాహ్మణులు" అని నిష్ఠురవాక్యము లాడెను. చండామార్కులు గడగడ వడఁకుచు గద్గదకంఠులై "దానవేంద్రా! మాయెడల నీవు కినుకఁ బూన వలదు. ఈతనికి మే మిట్టి దుర్బుద్ధి గఱపలేదు. మేము మీకు హితులము; పురోహితులము. వైరులము కాము" అని వినయ పూర్వకముగఁ దెలిపిరి. అంతట దానవేంద్రుఁడు నిజనందనుని విలోకించి "కుమారా! గురువులు చెప్పిన శాస్త్రంబు లేల పఠింపవైతివి?" అని యడిగెను. "తండ్రీ! మూఢులగు జనులు సంసారములోఁ జిక్కి జనన మరణములఁ బొందుచుందురు. అట్టివారికి హరిభక్తి లభ్యముకాదు. నేను సర్వశాస్త్రములును జక్కఁగా బరిశీలించితిని. శ్రీమన్నారాయణ చింతనముచే నెట్టి యాపదలయినను సులభముగా దాఁటవచ్చు" నని చెప్పెను, ఆ మాటలకు హిరణ్యకశిపుఁడు మండిపడి, తన తొడపై నున్న ప్రహ్లాదునిఁ గ్రిందికిఁద్రోసి, యచ్చటనున్న రాక్షసవీరులం జూచి యిట్లు పలికెను. "వీరులారా! వీనిబుద్ధిఁ గంటిరా! వీఁడు నాకే నీతులు గఱపుచున్నాఁడు. శ్రీహరి వీని పినతండ్రిని జంపినాఁడని యైన దలంపక వానియందుఁ జిత్తముఁజేర్చి వందివిధమున స్తోత్రము సేయుచున్నాఁడు. ఈతఁడు విష్ణుభక్తుఁ డగుటయేగాక, తోడిబాలురను గూడ విష్ణుభక్తులుగాఁ జేయుచున్నాఁడు. ఎవ్వరెంత బోధించినను వినకయున్నాఁడు. వంశదూషణుఁడగు వీనిఁ జంపవలయును. వీనిని గొనిపోయి మీ యిచ్చవచ్చినయట్లు శిక్షింపుఁడు" అని చెప్పినయంతనే

భయంకరాకారులగు రక్షోవీరులు ప్రహ్లాదుని దోడ్కొని పోయి 'హరిభక్తి విడిచెదవా? లేదా?' యని పలుకుచు రాజకుమారుఁడని యైనను భావించక కొట్టి శూలములచేఁ గ్రిందఁ బడవేసి లాగిరి. ఎంతబాధఁబెట్టిన నాతఁడు హరిభక్తి విడుతునని పలుకలేదు. ఆతని ధైర్య మెట్టిదోగాని కొట్ట వలదని బతిమాలలేదు. 'శ్రీహరీ' యను మాటతప్ప యాతని నోఁటినుండి మఱియొకమాట రాదయ్యెను. రాక్షసు లెంత హింసించినను నాతని శరీరము కందలేదు. ముఖవికాసము తగ్గలేదు. ఆసమయమున హరినిఁదప్ప నితరులను రక్షింపుఁడని కోరలేదు. తుదకుఁ దలినయినఁ దలంపలేదు. ఆహా! భక్తుఁ డనగాఁ బ్రహ్లాదుఁడే పరమభక్తుఁడుకదా! తమ శిక్షలు వానియెడలఁ బనిసేయలేదని రాక్షసులెల్లరు నద్భుతమంది దానవేంద్రునితోఁ జెప్పిరి. మరల భటులు వానిని గజములచే ద్రొక్కించిరి. సముద్రములో ముంచిరి. కొండపైనుండి క్రిందకుఁ ద్రోసిరి. అగ్నిలోఁ బడవేసిరి. సర్పములచేఁ గఱపించిరి. కశాగ్రంబులచే జావమోదిరి. ఎన్నిచేసిన నన్నియుఁ బ్రహ్లాదుని యెడల నిష్ఫలము లయ్యెను. అప్పుడు హిరణ్యకశిపుఁడు తన మనంబున "ఆహా! ఈ కుమారుని మహిమ యద్భుతముగ నున్నది. ఈతఁ డెన్నివిధముల బాధించినను జావకయున్నాఁడు. ఈతని కేయాపధములును దెలియవు. జీవనోపాయము నెఱుఁ గఁడు. వీనియందున్న యద్వితీయమైన తేజమే వీనిని రక్షించు చున్నదని తలంచెను. ఆలోచింపగా నాకీతనివలన మృత్యువున్న దని తలంచెదను" అని చింతించుచుండఁగాఁ జండామార్కులు వచ్చిరి. వారు దానవేంద్రునిచింత నెఱింగి, "ఓ రాక్షస చక్రవర్తీ! నీవేల విచారమందెదవు? నీ పరాక్రమమునకు సర్వలోక

ములును భయమందుచుండును. అట్టియెడల నీవు వీనినిగూర్చి యింతగా నాలోచింపనేల ? ఈతనికిఁ గొప్ప గృహస్థాశ్రమ ధర్మము లుపదేశించెదము. ఇంతలో మా తండ్రిగూడ వచ్చు” నని చెప్పి ప్రహ్లాదునిఁ గొనిపోయిరి.

ఇట్లు దోడ్కొనిపోయి యా గురుపుత్రు లాతని గృహస్థాశ్రమధర్మముల నుపదేశింపఁ దొడఁగిరి. ఆతఁడు వానిఁ బెడచెవింబెట్టి గురువులు పాఠశాలయందు లేనిసమయమున తోడి బాలురఁ గాంచి “మనగురువులు మనకు నుత్తమజ్ఞాన ముపదేశించుట లేదు. అనర్థకములగు ప్రకృతిధర్మములయం దర్థకల్పనము జేసి జెప్పుచున్నారు. దీనివలన మనకుఁ బ్రయోజనములేదు. నామాట విందురేని మీ రెల్లరు సుఖములఁ బడయుదు” రనిపలికి వారి కెల్లరకును హరిభక్తి నుపదేశించెను. వారెల్లరుఁ బ్రహ్లాదుని మాటలు విని పుస్తకముల నెల్లఁ గట్టఁగట్టి హరిభక్తులయిరి. చండామార్కు లీ విధమంతయు నెఱిఁగి తామిఁక నేమిసేయుటకును దోఁచక యక్కుమారునిదోడ్కొనిపోయి హిరణ్యకశిపుని సన్నిధిని నిలిపి “దైత్యేంద్రా ! మేము పడవలసిన శ్రమయంతయుఁ బడియుంటిమి. ఈతఁడొక్కఁడు చెడుటయేగాక తోడిబాలుర నెల్లర హరిభక్తులుగాఁ జేసెను. ఇఁక మే మీతనికి జదువుఁ జెప్పజాలము. చందనవనమునఁ దుమ్మచెట్టువలె మీ కులమున నీతఁడు జన్మించినాఁడు. ఇఁక వీనిని నీచిత్తము వచ్చినట్లు చేసికొను” మని చెప్పివెడలిరి.

అంతట హిరణ్యకశిపుఁడు తనయునిఁ జూచి "ఓరీ తులువా! నాయాజ్ఞలేక నినుఁ డెండఁగాయఁడు, వాయువు వీవఁడు, అగ్ని వెలుఁగఁడు, యముఁడు ప్రాణులం జంపఁడు. అట్టియెడ నీవు బాలుఁడవయ్యును నాయాజ్ఞను దప్పుచుంటివి. ఓరీ! జనకద్రోహీ! శ్రీహరిని మించినవాఁడీ జగంబున లేఁడని గట్టిగ వక్కాణించుచుంటివి. ఆ విష్ణు వెచ్చటనుండునో నాకుఁ జూపుము. సమస్తదేవతలును నాకు భృత్యులై చరించుచుండ నీవు నన్ను ధిక్కరించుచుంటివి. నిన్నిప్పుడే చంపి కులము నిష్కళంకముఁ జేసెదను. నేను సమస్తలోకములను జయించితిని. అమరులెల్లరును నేనే దిక్కని నమ్మియున్నారు. నా తమ్మునిఁ జంపిన శ్రీహరికొఱకు నేను లోకములన్నియు వెదకితిని. వాఁడు నాకెచ్చటను గనుపింపలేదు. నాకు సమానుఁడైన బలపరాక్రమవంతుఁడీజగంబున లేఁడు. నీకెవ్వఁడుదిక్కనినన్నెదిరించుచున్నావు?" అని గద్దించి యడిగిన తండ్రికి ప్రహ్లాదుఁడిట్లనెను. "తండ్రీ! బలముగలవారికిని, బలహీనులకును, పిపీలికాది బ్రహ్మపర్యంతము గల సమస్తజీవులకును, నీకును నాకును గూడ నాధార మెవ్వఁడో యట్టివానిబలమునే నేనునమ్మితిని. నాయనా! నిన్నుఁగూడి వర్తించువారు నిజము నెఱింగింపరు. నిన్నుఁ బొగడుచుందురు. వారి సన్నుతికి నీవు సంతోషించుచుందువు. మఱియొకమాట వినుము. దైత్యేంద్రా! నేను సమస్తలోకములను జయించితినని పలికితివి. దీనివలన నేమి ప్రయోజన మున్నది? ఇంద్రియానీకమును, మనస్సును మాత్రము గెలువలేకపోయితివి. అట్టి విజయము గైకొంటివేని లోకములో నీకు శత్రువే యుండఁడు. కావున బాలుఁడనైన నా పలుకు లాలించి, యహంకారము విడిచి విష్ణునిపై జిత్తముఁజేర్చుము".

కుమారుని పలుకులు విని హిరణ్యకశిపుఁడు కోపారుణిత నేత్రుఁడై "నీవు చావునకుఁ దెగించి యిట్లు పలుకుచుంటివి. నాకంటె లోకములో నెవఁడును రాజు లేఁడు. నీవు శ్రీహరిని బహువిధముల స్తుతించుచుంటివి. వాఁడెక్కడనుండునో నాకుఁ జూపుము. నిన్నును వానినిగూడ వధించెదను" అని పలికెను. అప్పుడు ప్రహ్లాదుఁడు శ్రీహరిని మనస్సున దలంచి తండ్రిని విలోకించి యిట్లు చెప్పెను.

క. "ఇందుఁ గలఁ డందు లేఁడని
సందేహమువలదు చక్రి ♦ సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే కలఁడు దాన ♦ వాగ్రణి! వింటే"

మ. "కలఁడంభోధిఁగలండుగాలిఁగలఁడా♦కాశంబునన్ గుంభినిఁ
గలఁ డగ్నిన్ దిశలన్ బగళ్ళ నిశలన్ ♦ ఖద్యోత చంద్రాదులన్
గలఁ డోంకారమునన్ ద్రిమూర్తుల ద్రిలిం♦గవ్యక్తులందంతటన్
గలఁడీశుండుగలండు తండ్రి! వెదకం ♦ గానేల యీయాయెడన్

నిజభక్తుండగు ప్రహ్లాదుఁ డీవిధమునఁ జెప్పుచుండ, శ్రీహరి యక్కుమారుని రక్షింపఁ దలఁచి నరసింహరూపమున సమస్త ప్రదేశముల నిండియుండెను. ప్రహ్లాదుని మాటలువిని "ఓ! వంశనాశకా! నీకు వినాశకాలము సమీపించినది. విష్ణువు సమస్త ప్రదేశములందు నుండు నని వచించితివి. ఆ చక్రి నీ సభాస్తంభంబునఁ జూపఁగలవా? అట్లు చూపవేని నీ శిరము వ్రక్కలు చేసెదను" అని పలికెను. ప్రహ్లాదుఁడు "తండ్రీ! సమస్తప్రదేశములయందు నుండు భగవంతుఁ డీ సభాస్తంభంబునమాత్ర మేల యుండఁడు? ఆతని నిందుఁ

దప్పక చూపెద" నని పలుక, దానవేంద్రుఁడు క్రుద్ధుఁడై విలయకాల రుద్రాకృతి ధరించి, శ్రీహరి నిందుఁ జూపుమని గదచేత సభాస్తంభమును మోఁదెను. వెంటనే యందుండి భూమ్యాకాశములు బ్రద్దలగునట్లు గొప్పధ్వని ముందుగా విన వచ్చెను. పిదప నందుండి వికసితపాణిపద్మయుగళుఁడును, శంఖ చక్ర గదా ఖడ్గాయుధ ధరుండును, విశాలవక్షుఁడును, భయం కర వదనుఁడును, దీర్ఘ కేసరుఁడును, వీర కరుణారస సంయుతుఁ డును, కేవల నరాకృతియు మృగాకృతియుఁ గాని నరసింహ రూపముఁదాల్చి శ్రీహరి యావిర్భవించెను.

హిరణ్యకశిపుఁ డా భయంకరస్వరూపమునుఁ జూచి తన యంతరంగమునఁ 'బ్రహ్లాదునిమాట ధ్రువపఱిచి వానిని రక్షించుటకును, నన్ను వధించుటకును శ్రీహరి యీరూపమున నవతరించెను. ఈతనిచే నాకుఁ జావు నిశ్చయము. అయిన నా బలశౌర్యములు ప్రకటించి పోరాడెదఁగాక !' అని తలంచి నరసింహమూర్తి కెదురై కొంతవడికుఁ బోరెను. తుదకు శ్రీహరి వానిం బట్టుకొని, దివారాత్రములు రెండునుగాని సంధ్యాసమయమున, లోపల వెలుపలఁగాని సభాద్వారమున, ఆకాశమును భూమియుఁ గాని యూరుభాగమున, ప్రాణములు కలవియు లేనివిగాని గోళ్ళచేత నతని హృదయమును జీల్చి, యా రక్తమునుబీల్చి, ప్రేవులు పుష్పమాలికలుగ గంఠమున ధరించెను. హిరణ్యకశిపుని మరణమునకు బృందారకులు కుసుమ వర్షము గురిపించిరి.

నరసింహమూర్తి రూపము మహా భయంకరముగ నుండెను. బ్రహ్మాదులుగూడ నాతనిని సమీపింపలేకపోయిరి.

దేవతలెల్లరును లక్ష్మిని దోడ్కొని వచ్చిరి. ఆమె కూడ నాథుని సమీపించుటకు వెఱచెను. అప్పుడు బ్రహ్మాదులు దేవదేవుని శాంతింపఁ జేయుటకుఁ బ్రహ్లాదునే నియోగించిరి. అంతఁ బ్రహ్లాదుఁడు నరసింహదేవునిఁ జేరి తత్పాదకమలములకు నమస్కరించి చేతులు మోడ్చి యిట్లు సన్నుతించెను. "దేవా! యోగులు సైతము నీ మహామహిమను వర్ణింపఁ జాలరు. నీలీల లనంతములు. బాలుఁడనగు నేను నిన్నెట్లు స్తుతింపఁగలను? నే నవివేకుఁడను. నీ భయంకర రూపంబు నీక్షించి నేను భయమందనుగాని సంసార దవానలమునకు మాత్రము భయమందుచున్నాఁడను. కావున నా యెడల గరుణవహించి నన్ను నీ పాదసేవకునిగ నేలుము. దేవా! భక్తప్రియుఁడవు. ద్రోహియగు నా తండ్రిని శిక్షించితివి. దానింగూర్చి నేను విచారమందను. దుష్టశిక్షణమును శిష్టరక్షణమును నీకు నైజగుణములు. స్వామీ! నీభయంకరాకృతిఁ జూచి యందఱును భయమందుచున్నారు. శాంతించి లోకములఁ గాపాడుము. నిన్ను సేవించి, నీ కరుణకు బాత్రులగుటకు భక్తియే ప్రధానము." ప్రహ్లాదుని ప్రార్థనమునకు శ్రీహరి సంతసించి శాంతము వహించి యాతని శిరమున దనహస్తమునుంచి "ప్రహ్లాదా! భయ మందవలదు. నీ భక్తికి నే నెంతయు సంతసించితిని. నీకు సర్వశుభములు గలుగుగాక! నీ తండ్రి నిన్నెంత బాధించినను నన్ను నమ్మియుంటివి. నీకేమి వరము కావలయునో కోరుకొను" మని పలికెను. ప్రహ్లాదుఁడు శ్రీహరిని విలోకించి "దేవా! నీవు నా పినతండ్రిని వధించి నందులకు నాతండ్రి నీపై బగఁగొని నీచేఁ గూలి కృతార్థుఁ డయ్యెను. మహేంద్రునిఁ దృణీకరించిన యతని వైభవమే

యశాశ్వతమైనప్పుడు నాకుమాత్ర మిట్టివానివలన లాభ మేమి యున్నది? కామాదులను జయించినవాఁడే ధన్యుఁడు. జగన్నాథా! అల్పుఁడ నగు నాపై గరుణవహించి వరంబిచ్చెద నంటివి. నీకట్టికోరిక కలదేని కామాదులయందు నాబుద్ధి ప్రవేశింపకుండ వరం బిమ్ము. నా తండ్రికి ఉత్తమలోకముఁ బ్రసాదింపుము." అని పలికిన సంతసించి యస్కుమారుని విలోకించి "భాగవతోత్తమా! నీ తండ్రినిగూర్చి నీవు చింతింప నవసరము లేదు. నీజన్మముకతన నీతండ్రి కృతార్థుఁడయ్యెను. నీవు నా భక్తులలో నగ్రగణ్యుఁడవు. రాజ్యమును బాలింపుము. సమస్త భోగముల ననుభవింపుము. ధర్మము నరయుము. అంత్యమున నన్ను సమీపింతు" వని పలికి లక్ష్మిం గూడి నిజనివాసమున కరిగెను. బ్రహ్మాదులు ప్రహ్లాదునిఁ బట్టభద్రునిఁ జేసి దీవించి చనిరి. నిష్కపట భగవద్భక్తిచేఁగదా మన ప్రహ్లాదుఁ డిట్టి స్థితికిఁ బాత్రుఁడైనది.

# ౧౬. విదురుఁడు

హస్తినాపురాధీశ్వరుఁ డగు శంతనునకు సత్యవతి యను భార్యయందుఁ జిత్రాంగద విచిత్రవీర్యులను నిరువురుసుతు లుదయించిరి. శంతనుని యనంతరమున, గంగాసుతుఁడగు భీష్ముఁడు చిత్రాంగదునకుఁ బట్టముఁ గట్టెను. కాని యాతఁడు కాలవశమున గంధర్వులచే నిహతుండయ్యెను. అప్పుడు విచిత్రవీర్యుఁడు భారత సామ్రాజ్యమున కధిపతి యయ్యెను. భీష్ముఁడు కాశీరాజపుత్రికలగు నంబికాంబాలికలను విచిత్రవీర్యునకు వివాహముఁ జేసెను. సంతతిఁ గాంచకపూర్వమే విచిత్రవీర్యుఁడు మరణించెను. సత్యవతీదేవి యందులకుఁ గడు వగచి, వివాహమాడి వంశము నిలుపుమని భీష్మునకుఁ జెప్పెను. దృఢప్రతిజ్ఞుఁడగు నాతఁ డందులకు సమ్మతింపలేదు. అప్పుడు సత్యవతి తనపుత్రుఁడగు వ్యాసునిఁ దలఁచుకొనెను. ఆతని యనుగ్రహమున విచిత్రవీర్యుని సతులగు నంబికాంబాలికలయందు ధృతరాష్ట్రపాండురాజులు జనించిరి. అదృష్టవశమున నంబిక పరిచారికకుఁ గూడఁ బుత్రుఁడు జనించెను. ఇతఁడేమన కథానాయకుఁడగు విదురుఁడు. ఈ మువ్వురును వేదవ్యాసుని ప్రతిబింబములే. విదురుఁడు శూద్రక్షేత్రమున జనించినను తన సుగుణసంపత్తిచే జగంబున యశంబుగాంచెను. అఖిలధర్మములకును, నీతులకు నాతఁ డాలవాలము. గుణమునకుఁ గులముతోఁ బనిలేదుకదా! మహాపురుషులకును, దివ్యవాహినులకును జననస్థానములు యోజించిన ప్రయోజనం బేమియున్నది? నీచగుణులకు సద్గుణవంతులును, సద్గుణవంతులకు నీచగుణులునుఁ బుట్టుచుండుట కలదు. కేవలము రాక్షసకృత్యములు సేయుచున్న వేనుని దేహమునుండి, శ్రీమన్నారాయణ స్వరూపుండగు పృథుచక్రవర్తి జనించెను.

చతుర్దశభువనవంద్యుఁడగు విశ్రవసునకు త్రిలోకకంటకుఁడగు దశకంఠుఁ డుద్భవించెను. క్రూరాత్ముండగు హిరణ్యకశిపునకు పరమభాగవతోత్తముఁడగు ప్రహ్లాదుఁడు జనించెను. క్షీర సముద్రమున హాలాహల ముద్భవించెనుకదా!

అట్లు జనించిన విదురుఁడు ధృతరాష్ట్ర పాండురాజుల తోపాటు సమస్తవిద్యలను నభ్యసించి, వారితో సమాన గౌరవమును బొందుచుండెను. ధృతరాష్ట్రుఁడు రాజయ్యెను. పాండురాజు యువరాజయ్యెను. విదురుఁడు మంత్రియయ్యెను. విదురుఁడు మంత్రియై యున్నను రాజ భోగాదులయం దాతని కాసక్తి లేదు. విజితేంద్రియుఁడగు నాతఁడు సాధుజనారాధన ములయందును, సజ్జన పూజనంబులయందును నాసక్తితోఁ గాలముఁగడపుచుండెను. పాండురాజు మునిశాపంబున మరణ మందిన పిమ్మట, విదురుఁడు రాజ్యచక్రము నడపుటకు ధృత రాష్ట్రునకు విశేషముగఁ దోఁడుపడవలసి వచ్చెను. అప్పుడాతని బుద్ధిబలము లోకమునకుఁ బూర్తిగాఁ దెలిసినది. విదురుఁడు పురుషోత్తముండనియుఁ బరోపకార పరాయణుండనియుఁ బరమ భక్తాగ్రేసరుఁడనియు, నాశ్రితజన శరణ్యుఁడనియు, స్వార్థ త్యాగశీలుండనియు, రాజనీతివిశారదుండనియు జగము ప్రశం సింపఁ దొడంగెను. కురు పాండవులకు రాజ్యభాగమునుగూర్చి కలహాము గలుగనున్న సమయమున నీతఁడు కౌరవులయొద్ద నున్నను ధృతరాష్ట్రునకుఁ బెక్కు ధర్మబోధలు గావించెను. అట్టి సమయమున నాతఁడు స్వధర్మమునే చూచుకొనెను. తన యుద్యోగమును లక్ష్యముసేయలేదు. ఇతరుల కప్రియ మగు నేమోయని శంకింపలేదు. ఉభయపక్షముల శ్రేయమును

గోరెను. ధృతరాష్ట్రుఁ డీతని బుద్ధిని బూర్తిగ గ్రహింపఁజాలక పోయెను. దుర్వినీతుండయిన కుమారుని యిచ్ఛననుసరించి ప్రవర్తించెను, కాని దానివలన కులక్షయ మగుననితలంపకపోలేదు. విదురునకుఁ గౌరవులయందు ద్వేషమును, బాండవులయందు స్నేహమునులేదు. కేవలము ధర్మసంరక్షణమునకే యాతఁడు తన శక్తిధారవోసెను. కురుపాండవయుద్ధము జరుగకుండఁ జేయవలయునని యాతఁడెంతయో ప్రయత్నించెను. కాని దైవము ప్రతికూలుఁడై యున్నప్పు డెవ్వరేమి సేయగలరు?

విదురునకుఁ గృష్ణునియందు మిగులభక్తికలదు. ఆతని నిష్కళంకహృదయము, ధర్మతత్త్వము కృష్ణునకు బాగుగఁ దెలియును. ఆ కారణముచేతనే కృష్ణుఁడు పాండవదూతయై సంధికార్యమునకై హస్తినాపురమునకు వచ్చినప్పుడు, దుర్యోధనుఁ డా భగవంతునిఁ దనయింట నన్నము గుడువుమని వేఁడికొనెను. అందులకు వాసుదేవుఁడాతనిఁజూచి "నేను పాండవ కార్యార్థినై దూతగా వచ్చితిని. ఆ పనిఁ దీర్చుకొనకుండ ముందుగా భుజియించుట మంచిదికాదు. అదియుంగాక పగతుర యింటఁ గుడిచిన నది యమృతంబయినను విషంబను యనుమానము వొడమును. అందుచేత శత్రువులయింట భుజింపరాదు. నేను నీకెట్లు శత్రువుఁడనని యడుగుదువా? వినుము. నీవు పాండవుల ద్వేషించుచుందువు. వారు నాకు బ్రాణసములు. ఇచ్చట నాకొక విదురునియన్నము భోక్తవ్యమని తలంచితి" నని పలికి విదురుని గృహంబున కరిగెను. ఆహా! విదురుని జన్మమే జన్మము! సాక్షాద్భగవంతుండగు వసుదేవసూతి పిలువకుండ విదురుని ఇంటికరిగెను. కృష్ణుఁడు తన గృహంబున

కరుదెంచె నని విదురుఁ డానందసాగరమున మునింగి యనేక విధములగు వంటకములఁ జేయించెను. అనంతరము సాత్యకి సహితుండగు నా భగవంతునకు విందుఁ గుడువబెట్టి, చందన చర్చాద్యర్చనంబులు గావించి విదురుఁడు కృతార్థుఁడయ్యెను. కృష్ణుఁడు కౌరవసభలో సంధినిగూర్చి ప్రశంసించునప్పుడు దుర్యోధనాదు లతనిని బంధింపఁ దలంచిరి. శ్రీహరి యప్పుడు విశ్వరూపమును ప్రదర్శించెను. విదురుఁడు ధృతరాష్ట్ర దుర్యోధనులకుఁ జెప్పవలసిన నీతు లిదివఱకే చెప్పెను. భగవంతుని విశ్వరూప ప్రదర్శనానంతరమున మరల నింకొకసారి చెప్పదలంచి యాతఁడు ధృతరాష్ట్రునిఁ జూచి యిట్లు పలికెను. "ధృతరాష్ట్ర మహీపాలా! సచరాచరంబగు జగంబున కంతకు నెవ్వఁడాధారుఁడో యట్టి శ్రీమన్నారాయణుఁడే ఈ కృష్ణుఁడు. ఇట్టి పరమాత్ముని నీపుత్రులు బంధింపఁ దలంచిరి. వీరియవివేకము నేమందును? ఈ కృష్ణుఁడు పాండవులకు జుట్టము, సఖుఁడు, గురుఁడు, దైవమునై యున్నాఁడు. కృష్ణపరిరక్షితులగు పాండవులను దేరిచూచుట కెవ్వరును శక్తులుగారు. నీవు వంశమును రాజ్యమును రక్షించుకొనఁ దలంచితివేని దుర్యోధనుని మాట వినక పాండవులకు నర్ధరాజ్యంబు నిమ్ము. అది వంశాభివృద్ధికి మార్గంబగును. కాదేని నీతనయులునూర్వురును భీమునిచేతిలోఁ బడి తీఱుదురు. దుర్యోధనుని మాటలును, భీష్మ ద్రోణాదుల భుజబల శౌర్యంబును, కర్ణుని దురాలాపంబులును నీవు నమ్మ వలదు. ఒక్కదుర్యోధనునికొఱకు నీవు కులమునకెల్ల నాశనము గూర్చుట ధర్మముకాదు. నామాట విని యీ దుర్యోధనుని బరిత్యజింపుము."

విదురుని పలుకులకు దుర్యోధనుఁ డాగ్రహించి "మా శత్రువుల నిరంతరముఁ బొగడుచు వారి క్షేమమునే కాంక్షించు నీవు మాయండ నుండవలదు. నగరము విడచిపొమ్ము" అని తీవ్రముగా బలికెను. విదురుఁ డాతని వాక్యములకుఁ గోపింప లేదు. విధికృత మిట్లుండ నెవ్వ రేమిసేయుదు రని తలంచి యా క్షణముననే కృష్ణుని యనుజ్ఞ వడసి నగరము విడిచి పోయెను. కృష్ణుఁడు వచ్చినపని కాలేదు. యుద్ధమే నిశ్చయమైనది. అతఁడు పాండవులకడకు మరలిపోయెను.

హస్తినాపురము విడిచి యరిగిన విదురుఁడు మహారణ్యాపథంబును బట్టి చని హరిభజించుచు, ననేక పుణ్యక్షేత్రములు దివ్యతీర్థములు సేవించుచు, మునీంద్రుల దర్శించుచుఁ గ్రుమ్మరుచుండెను. ఇదివఱ కాతని నెఱింగినవారయినను విదురుఁడని యానవాలు పట్టలేని రూపముననుండెను. అతఁ డనేక ప్రదేశములగడచి, యమునాతీరంబునకుఁ బోయి యచ్చటఁ గృష్ణునకుఁ బరమ సఖుఁడును భక్తుఁడు నగు ఉద్ధవునిఁ గలిసికొనెను. అచ్చట నాతఁడు హరిచరణకమల ధ్యానమున బ్రపంచమే మఱచిపోయెను.

కురుక్షేత్రమున భయంకరమయిన యుద్ధము జరిగి పోయెను. అధర్మపరులగు కౌరవులు సైన్యసమేతముగా బేరైన లేకుండ నశించిరి. పాండవులు విజయలక్ష్మి లాలితులయిరి. హస్తినాపురమున నెక్కడఁ జూచినను శోకారావములే. ఆ సంక్షుభితసమయమునకు విదురుఁడు మరలనగరమునకు వచ్చెను. పుత్రశతంబునుఁ గోలుపోయి మహాదుఃఖసాగరమున మునింగి యున్న ధృతరాష్ట్రునిఁజేరి యాతని నూరార్చుచు నిట్లు పలి

కెను. "మహీపాలా! పుట్టుటయుఁ జచ్చుటయుఁ బ్రపంచము నందున్న సమస్త జీవులకును సహజ గుణములు. మృత్యువుకు వీరు వారను భేదములేదు. ఎట్టి ధీరుఁడైనను నెట్టి పుణ్యాత్ముఁడయినను మరణము నందవలసినదే. దీనికై వగవనేల? ఇదియుంగాక నీ సుతులు రణనిహతులై వీరస్వర్గమున కేగిరి. రణనిహతులైనవారికి, యజ్ఞాదులంజేసినవారు పొందు దివ్యపదవికన్న మహోన్నతపదవి లభించునని శాస్త్రముల యందుఁ జెప్పఁబడియున్నది. జననమరణయుతంబగు నీ సంసారమున నెవ్వరికొఱకు వగచెదవు? ఇందులో నిత్యులెవ్వారు? ఇదియంతయు నొక నాటకరంగస్థలము. రంగస్థలము నలంకరించిన పాత్రములు తమపని పూర్తియైన వెంటనే నిష్క్రమించు చందమున భూతలంబున జనించిన మానవులు బ్రహ్మ నియమించిన యాయువు చెల్లినయంతనే పోవుచుందురు. ఈ శరీరములు మృణ్మయపాత్రముల వంటివి. ఎప్పటికైనను నష్టము గావలసినవే. ఉత్తమజ్ఞానసంపన్ను లీ పరమరహస్యము నెఱింగి, యిట్టివానికి దుఃఖింపకయుందురు. ప్రపంచమునఁ బ్రతికార్యము నీశ్వరేచ్ఛ ననుసరించి యుండును. మరణించినవారి కొఱకు బ్రతికియున్నవారు దుఃఖించుచు శరీరములఁ గృశింపఁ జేసికొనినందువలనఁ బ్రయోజనము లేదు. ఎంత యేడ్చినను జచ్చినవారు మరలరారు. కావున నీవు శోకము విడిచి, పరమేశ్వరునియందు నీచిత్తముఁజేర్చి జీవయాత్ర వెడలదీయుము."

నిశ్చలజ్ఞాన పరిపూర్ణుఁడగు విదురుని తత్త్వోపదేశమున ధృతరాష్ట్రుని చిత్తమునకుఁ గొంతశాంతి కలిగెను.

హస్తినాపుర సామ్రాజ్యమునకు ధర్మనందనుఁ డభిషిక్తుఁడైన కొన్నాళ్ళకు ధృతరాష్ట్రుఁడు తపోవృత్తి నుండుట

కరణ్యమునకుఁ బోయెను. ధృతరాష్ట్రుని వెంట సంజయవిదురులును, కుంతీగాంధారులునుగూడఁ బోయిరి. అరణ్యమునకుఁ బోయిన విదురుఁ డచటఁ బ్రకృతిసౌందర్యమున కానంద మందుచుఁ దన చిత్తమంతయు హరియందు లగ్నము సేసి యానంద మందుచుండెను. శ్రీమన్నారాయణ నామచింతనామృతమే యాతని కాహార మయ్యెను. కొన్నాళ్ళవఱకు నాతఁడు ధృతరాష్ట్రుని సన్నిధియందే యుండెను. తరువాత నాతనిభక్తి క్రమక్రమముగా హెచ్చిపోవుటచేత నొకచోట నిలువక చరించుచుండెను. రెండుదినముల కొక్కసారి గాని, మూఁడుదినముల కొక్కసారిగాని వచ్చి ధృతరాష్ట్రాదులఁజూచి పోవుచుండెను. భక్తాగ్రేసరుఁడును, మహాజ్ఞానసంపన్నుఁడును, ధర్మచరిత్రుఁడు నగు విదురునకు జగమంతయు హరిమయముగ గాన్పించుచుండెను. క్రమక్రమముగా నతఁడు కఠిన తపము నందుఁ బ్రవేశించెను. ఇట్లుండ ధర్మరాజు తనతల్లియగు కుంతిని, గాంధారీ ధృతరాష్ట్ర విదురసంజయులను జూడఁదలంచి యరణ్యమునకు వచ్చెను. అచ్చట నాతనికి విదురుఁడుతప్ప తక్కిన వారు కనిపించిరి. విదురునిఁగూర్చి ధర్మరాజు ధృతరాష్ట్రు నడుగ నాతఁ డిట్లనెను. "వత్సా! ధర్మనందనా! విదురుఁ డిప్పుడు మిగుల కఠినమైన తపోవృత్తిం బూనియున్నాఁడు. ఆతఁ డాహారముఁగూడ మానివేసి కేవలము వాయుభక్షణుండై శరీరమున జీవములఁ దాల్చియున్నాఁడు. ఆతఁ డేప్రదేశమున నుండెనో తెలియదు. ఇచ్చటి కప్పుడప్పుడు వచ్చుచుండును. జీర్ణశరీరుఁడై శల్యావశిష్టుఁడై యున్నాఁడు."

ఆ మాటలు విని యుధిష్ఠిరుఁడు విదురుని నెట్లయిన సందర్శింపఁ దనచిత్తము తొందరపెట్ట నాచోటు వాసి, యాతని

నన్వేషించుచుఁ బోయెను. ఇట్లు కొంతదూరముపోవ నా ధర్మజున కొక చోట, ధూళిమలిన దేహుండును, జటీభూత కేశపాశుండును, కేవల దిగంబరుఁడును నగు విదురుఁడు కనిపించెను. ధర్మజుఁ డాతనిని సమీపించుచుండ నాతఁడు నిలువక ముందునకు బోవుచుండెను. ధర్మరాజాతనిం గలిసికొనుటకు శీఘ్రగమనంబునఁ బోవుచుండెను, కాని కలిసికొనలేక పోవుచుండెను. అప్పు డతఁడు "విదురా! విదురా! నేను నీకు బుత్రతుల్యుఁడ నగు ధర్మనందనుండను. నిన్ను దర్శింపఁ దలంచి వచ్చితిని. నా యెడల నిర్దయ వహించి దర్శనం బీయకుండుట నీకుఁ దగదు. నన్ను మన్నించి నిలువు" మని గట్టిగాఁ బలికెను. విదురుఁ డాతని వాక్యము వినియు, వెనుకకు దిరిగి చూడక పోవుచుండెను. ధర్మజుఁడు నడచుట కాయాస మందుచుండెను. ఎంత పిలిచినను విదురుఁడు నిలువక యుండెను. అప్పుడాతఁడు మరల విదురునిఁజూచి యెలుఁగెత్తి "విదురా! నిలువుము. నేను యుధిష్ఠిర భూపాలుఁడ"నని పలికెను. అప్పుడు విదురుఁ డాగిపోయెను. మహా తపోవృత్తియం దున్నను విదురుఁడు రాజాజ్ఞను మన్నించెను. అతఁడొక వృక్షమూలమున నిలిచియుండెను. అప్పుడు ధర్మసంభవుఁ డాతనిని నెమ్మదిగా సమీపించి నమస్కరించెను. విదురుఁ డేమియు మాటలాడక తదేక దృష్టితో ధర్మనందనునిఁ జూచుచుండెను. ఇట్లు చూచి చూచి కొంతసేపటి కాతఁడు తన యోగబలంబున ప్రాణములును, సర్వేంద్రియములును, తేజమును, ధర్మనందనుని ప్రాణేంద్రియ తేజంబులందు నిలిపి శరీరము జాలించెను. ధర్మసుతునకు బలంబును, తేజంబును, దేహకాంతియు హెచ్చెను. ఆకస్మికముగ నిట్లు జరిగినందులకు ధర్మతనూభవుఁ డాశ్చర్యము నందెను. అట్లు

స్వచ్ఛందమరణముఁ గాంచిన విదురుని శరీరమునకు స్వధర్మాను రూపముగా ధర్మజుఁ డగ్నిసంస్కారము జేయఁదలంప నాకాశ వాణి వారించెను.

ఆహా! శూద్రకుల సంజాతుఁడయ్యును బ్రహ్మతేజో ధనుఁడై ప్రకాశించిన విదురుఁడు; క్షత్రియోచిత విద్యలనేర్చి మంత్రశిఖామణియై యుండియు నస్త్రశస్త్రముల బట్టి రణంబున బ్రవేశింపక శాంతమూర్తియై భాసిల్లిన విదురుఁడు; మానావమానముల, సుఖదుఃఖముల, కలిమిలేముల నొక్కవిధముగ భావించిన యోగీశ్వరుఁడయిన విదురుఁడు; తన గృహాశ్రమ ధర్మమును సర్వోత్కృష్టముగా నిర్వహించుకొనిన విదురుఁడు; ప్రేమమయుండగు విదురుఁడు; బ్రహ్మాదులకుఁ గూడ దుర్లభుండగు జనార్దనుని యనుగ్రహమునకుఁ బాత్రుఁడై హరిభక్తాగ్రేసరుఁడని పేరుగన్న విదురుఁడు; తన భౌతిక దేహమునుజ్జగించినను దివ్యంబగు కీర్తిశరీరముఁ దాల్చి నేఁటికిని దేజరిల్లుచున్నాఁడు.

స ం పూ ర్ణ ము